ఓమ్

# నిగమాగమ రహస్యం
మరియు
# ఋషి విజ్ఞానము



కర్త :

అనుశ్రుత వైజ్ఞానిక
చల్లా కృష్ణమూర్తి శాస్త్రి

**శృతి దర్శన్**

**శ్రీ మధుసూదన్ ఓఝా**

**ఎడ్యుకేషనల్ మరియు కల్చరల్ సొసైటీ**

రిజిస్టర్డ్ నెం. 6144 / 99

ఆధ్వర్యములో  ముద్రింపబడినది.


**సంప్రదించుటకు:**

ఆచార్య వాసుదేవ,

ఫ్లాట్ నెం. 88 , గాయత్రి నగర్ బ్యాంకు కాలనీ,

(వియా) సాహెబ్ నగర్,

హైదరాబాద్ – 500070.

ఆంధ్ర ప్రదేశ్.    ఫోన్ : 9948917071



అనుశ్రుత వైజ్ఞానిక

చల్లా కృష్ణమూర్తి శాస్త్రి

(1904 - 1965)



# నిగమాగమ రహస్యం

శబ్ద రాశియంతయు, నిగమాగమములనుకొను భేదముచే రెండు భేదములు – ఇందుకు కారణము, ప్రకృతి సిద్ధమగు, నిత్యమగు శబ్ద బ్రహ్మ ఇట్లు విభజింపబడి యున్నది. ఎట్లన "అధోవాగేవేదంసర్వం," "వాచీమాభువనాన్యర్పితా" ఇత్యాది శ్రౌతసిద్ధాంతానుసారము, వాక్తత్వము నుండి పుట్టిన శబ్ద ప్రపంచముచే ఆచ్ఛాదితము పూర్ణమును గాని స్థానమేదియులేదు. అయినను –

(1) స్తంబ రూపతమోవిశాలరూపసర్గ (2) క్రిమి కీట పక్షి పశుమనుష్య భేద భిన్నమగు పంచవిధ రజో విశాల సర్గము, (3) యక్ష రాక్షస పిశాచ గంధర్వ పిత్ర్య ఐంద్ర ప్రాజాపత్య బ్రహ్మ భేదభిన్నమగు అష్టవిధ సత్వ విశాల సర్గము ననబడు భూత సర్గములకు ముఖ్యముగ అగ్ని ఇంద్ర వాక్కు సంబంధము కలదు – "యధాగ్ని గర్భాపృథివీ తథా ద్యౌరింద్రేణగర్భిణీ" అన్నట్లు పృథివి అగ్నిమయి. ద్యులోకమనబడు సూర్యుడు ఇంద్రమయుడు. ఇక మధ్యదియగు అంతరిక్షము ఒక లోకము. భూః (పృథివి) భువః (అంతరిక్షం) సువః (ద్యౌ) అను నీ ముల్లోకమునుండియు ప్రజా నిర్మాణ మగుచున్నది. (1) పృథివి యందు అగ్నిసత్త. దీనితో మనుష్య ప్రజలకు సంబంధము. కనుక ఇది మనుష్య లోకము. (2) అంతరిక్షమందు చంద్రసత్త. దీనితో పితృ ప్రజలకు సంబంధము. కనుక ఇది పితృ లోకము. "విధూర్ధ్వభాగేపితరోవసంతి" (3) ద్యులోకమునందు సూర్యసత్త. దీనితో దైవ ప్రజలకు సంబంధము. కనుక ఇది దేవ లోకము. "చిత్రం దేవనాముదగాదనీకం" అయితే –

(1) "వాగితిపృథివీ" (2) "వాగ్ఘచంద్రమాభూత్వా ఉపరిష్టాత్తస్థౌ" (3) "సాయావాక్ అసౌ ఆదిత్యః సత్యం" అని ఉండుటచే ఈ మూడునూ, వాఙ్మయములే అయినను పృథివీ సూర్య వాక్కులకే ప్రాధాన్య మంగీకరింప బడుచున్నది. ఏలయన –

పార్థివ సౌరాగ్నులు అన్నాదములు (అన్నముతినునవి) ఇక మధ్య నున్న, చంద్రసోమము. "ఏషవైసోమోరాజాదేవానామన్నంయచ్చంద్రమాః" అనుటచేతను ఈ అగ్నులకు అన్నమగును. అన్నము అన్నాదుని ఉదరమున బడగనే అన్నాద సత్తయేగాని అన్నసత్త ముండదు. "ద్వయంవా ఇదగ్ం సర్వం అత్తాచైవా ద్యంచ తద్య దా ఉభయం సమాగచ్ఛతి అత్తైవాఖ్యాయతే నాద్యం" అని శ్రుతియు చెప్పెను. కనుకనే త్రైలోక్యమునకు ద్యావాపృథివీ అని వ్యవహారము. ఇట్లు ప్రధాన రూపముగా పృథివీ లోకము సూర్య లోకము అని రెండు లోకములు. రెండును అగ్నిమయములు –

పార్థివము, గాయత్రాగ్ని; సౌరము, సావిత్రాగ్ని "తస్యవా ఏతస్యాగ్నేః వాగేవోపనిషత్" అనుట వలన ఈ రెండగ్నులను, వాక్కు అనవచ్చును. ఇందు పృథివీ వాక్కు అనుష్టుప్. సూర్య వాక్కు బృహతీ. అని వైజ్ఞానిక పరిభాష, మరియు అనుష్టుప్ వాక్కు నుండి, క చ ట త పా ది రూపవర్ణవాక్కు

ప్రాదుర్భవించును. బృహతి నుండి, అ ఆ ఇ ఈ ఇత్యాది స్వరవాగ్వికాసము కలుగును. చివరకు వర్ణవాక్కు అనుష్టుప్ అనియు, స్వర వాక్కు బృహతి అనియు, ఫలితార్థము –

"స్వరో2క్షరం" అనుటచే స్వరము అక్షరము, అవినాశి క్షరము వర్ణము, వినాశి. అర్థసృష్టి యందు భౌతిక క్షర కూట ప్రతిష్ఠ అక్షర తత్వ మైనట్లు "శాబ్దేబ్రహ్మణినిష్ణాతః పరం బ్రహ్మాధి గచ్ఛతి" అనుటచే అర్థ బ్రహ్మ యొక్క సమానధారయందు ప్రవహించు శబ్ద బ్రహ్మ యందును, క్షరరూప వర్ణ ప్రతిష్ఠ అక్షర రూప స్వరతత్వమే. అర్థబ్రహ్మ యందు అక్షర రూప సూర్యసత్తను విడచి, క్షరరూప పృథివి, స్వస్వరూపమున ఉండజాలనట్లు, సూర్యవాఙ్మూలక స్వరతత్వము లేనిచో పృథ్వీమూలక వర్ణరాశియు స్వస్వరూపమున నుండ జాలదు. స్వరసహాయ రహితముగ వ్యంజనోచ్చారణ సాధ్యము కాదు –

స్వర మూలకమగు ఈ సూర్యవిద్యకే త్రయీవిద్యయని పేరు. సూర్యబింబము ఋగ్వేదము. సూర్యార్చిమండలము సామవేదము. సూర్యస్థ అగ్నిపురుషుడు యజుర్వేదము, సూర్యుడు ప్రకాశించుట అనగా త్రయీవిద్య ప్రకాశించు చున్నది అనుటయే; కనుకనే "సైషాత్రయ్యేవ విద్యాతపతి" అని శ్రుతి వాకున్నది. "త్రయీమయాయత్రిగుణాత్మనేనమః" అనుటలో రహస్యమిదియే. ఈ వేద తత్వము, నిత్యము, స్వయం ప్రాదుర్భూతము, స్వయం బ్రహ్మముఖ వినిర్గతము, కనుకనే ఋషులు దీనిని నిగమమన్నారు. నిర్గమమే పరోక్ష భాషలో, నిగమమైనది. ఇంతకు త్రయీ విద్యయనబడు సూర్యవిద్యయే నిగమవిద్య యని సారాంశము –

రెండవది ఆగమవిద్య; శని భౌమ బృహస్పతి శుక్ర, బుధ పృథివ్యాదులు సూర్యునకు ఉపగ్రహములు. ఆయన ప్రవర్గ్యభాగమే శన్యారూప పరిణతి నొంది అతనిం, బరిక్రమించుచున్నది. సూర్యాంశ భూత పృథివి, సూర్యుని పరిక్రమించుచున్నది. కనుక పృథ్వీ విద్య, సూర్య విద్య నుండి వచ్చినది. ఈ రహస్య బోధకే, ఋషులు దీనికి ఆగమ మని పేరిడిరి. ఇది సూర్యవిద్య వలె స్వయం నిర్గతము గాక నిగమము నుండి వచ్చుటచే నిగమాదాగతః" అను వ్యుత్పత్తిచే ఆగమమని చెప్పిరి. –

పృథ్వీ వాక్కు క్షర వాక్కు. అది స్వరము కంటే భిన్నము. కనుక ఆగమ ప్రయోగములకు ఉదాత్తాది స్వర సంబంధ మంతగా లేదు. కేవలము శబ్దావృత్తి (జపము) వలననే సిద్ధి. నిగమవిద్య యందు అట్లు గాక స్వరవాక్కునకు ప్రధానత. స్వరము లేని నాడు అది నిరర్థకము, అనిష్టకరము; శ్రుతియు, "యథేంద్రశత్రు స్స్వరతోపరాధాత్" అని అన్నది కదా. –

సూర్యవిద్య నిగమవిద్య. పృథివీవిద్య ఆగమవిద్య. అనుటలో నిగమము లందు కేవలము సూర్య నిరూపణయు, ఆగమముల యందు కేవలము పృథ్వీ నిరూపణయు, కలదని తాత్పర్యము కాదు. రెంటి యందును సమస్త విశ్వ నిరూపణయు కలదు. లక్ష్యములందు మాత్రమే భేదము. ఒక దాని యందు సూర్యుడు ప్రధానుడుగ రెండవ దాని యందు పృథివి ప్రధానముగ విశ్వనిరూపణ జరుగును.

"ద్యౌష్పితాపృథివీమాతా" అనుటచే ద్యులోకోపలక్షిత సూర్యుడు పిత, పురుషుడు, పృథివి మాత, ప్రకృతి. పురుషుడు "రేతోధా" ప్రకృతి యోని, పురుష శాస్త్రము నిగమము, కనుక వేద పురుషుడు అని దాని వ్యవహారము. ప్రకృతి శాస్త్ర మాగమము కనుక ఆగమ విద్యా అని దాని వ్యవహారము. ఆగమ రహిత నిగమము అప్రతిష్ఠితము. నిగమమునందును ఆగమ సామ్రాజ్యాము కలదు. కనుకనే పురుష వేదమును కూడ, వేద విద్య యనియు అందురు –

సూర్యుడు సాక్షాద్రుద్రుడు. అతని అనంతరశ్మలు అనంత రుద్రులు. ఈ అనంత రుద్రులు, విట్ రుద్రులు (ప్రజారుద్రులు) అందురు. సూర్య రుద్రుడు క్షత్రరుద్రుడు శ్రుతియు "అసంఖ్యాతాస్సహస్రాణయేరుద్రాః" "యేచైనం రుద్రా అభితోదిక్షుశ్రితాః" ఇత్యాదిగా రశ్మిగత త్రైలోక్య వ్యాపక అనంతరుద్రుల, నిరూపణయు. "ఏకోహి రుద్రో నద్వితీయా యతస్థుః య ఇమాన్ లోకాన్ ఈశత ఈశనీభిః" అని సూర్య రూప ఏకాకి, క్షత్రరుద్ర నిరూపణ చేసియున్నది

ఈ రుద్రరూపసౌరాగ్నికి "అగ్నిర్వారుద్రః తస్యైతే ద్వౌతనేయోఘోరాన్యాచశివాన్యాచ" అన్నట్లు ఘోర శివభేదమున రెండు శరీరములు ఉన్నవి. అధ్యాత్మ జగత్తునందు ఈ రెండు రూపములును చూడగలరు. అగ్ని అన్నాదమని మొదటనే చెప్పబడినది. అన్నము దినుట అగ్నియొక్క స్వాభావిక ధర్మము. జ్వలించునగ్ని కాష్ఠాన్నముండునంత వరకు స్వస్వరూపమున నిలచియుండును. దాని ఇంధనము (జ్వలనము) కాష్ఠాహుతిపై ఆధారపడి యున్నది. కనుకనే కట్టెలను ఇంధనము లందురు. శరీరాగ్నికినీ, ఇదేస్తితి. లోమ కేశ నఖాగ్రభాగములను విడచి సర్వ శరీరములందును వైశ్వానరాగ్ని వెలుగుచున్నది. తాకినచో యెల్లెడలను వేడిమిని, కందుము. ఇదే ఈ అగ్నికి ప్రత్యక్ష నిదశన్నము. ముక్కును చెవులును మూసుకొనునపుడు వినబడు నాదము దీని శ్రుతియే –

ఈ అన్నాదాగ్ని సత్త కొరకు రెండు పూటలా నన్నము దినవలశి యున్నది. అన్నాహుతి ఉండునంత వరకు శరీరము స్వస్తముగా ఉండును. యేలయన, అన్నము సోమ తత్వము. సోమము శాంత తత్వము. ఏతదాహుతి వలన రుద్రాగ్ని శాంతమై శివ తత్వమగును. అది లేనివాడు ఆరుద్రుడు ఘోర రూపమున పరిణతుడై మొదట, రసాసృజ్మోంసాది శారీర ధాతువులను దిన మొదలిడును. అవియు నష్టమగుటతో తానును ఉత్క్రాంతుడగును. ఇంతకును అన్నాహుతివలన రుద్ర తనువు శివభావము నొంది పాలన మొనరించుననియు, తదభావమున అదియే ఘోర రూపము నొంది, నాశకారణమగుననియు తేలినది.

మనము ప్రతి దినము తిను నన్నము వలన ఉగ్రరుద్రులు శాంతిల్లుచున్నారు. కనుక అన్నము నకు శాంతదైవత్యము, శాంత రుద్రీయము, అని వైజ్ఞానికులు పేరులు పెట్టిరి. అదే పరోక్షభాషయందు శతరుద్రీయము అని ప్రశిద్ధి నొందినది. చూడుడు. శతపథబ్రాహ్మణం "అత్రైషసర్వో2గ్నిః సంస్కృతః సఏషో2త్రరుద్రో దేవతా స దీప్యమానో2తిష్ఠత్ అన్నమిచ్ఛమానః తస్మాద్దేవా అభిభయుః

యద్వైనో2యంనహింస్యా దితి తస్మైఏతదన్నం సమభరత్ శాంత దైవత్యం తేనైనం అశమయన్ శాంతదైవత్యం హవై శతరుద్రియ మిత్యాచక్షతేపరోక్షం పరోక్ష కామాహిదేవాః" –

తల్లి యొక్క గర్భము నందు అగ్ని యొక్క క్రమిక చితి వలన క్రమశః ప్రవృద్ధమగు గర్భము, నవ మాసానంతరం, పూర్ణభావము నొందినపుడు, సర్వవిధముల సంస్కృత మగు రుద్రాగ్ని యొక్క ఆఘాతము వలన, ఏవయామరుత్తు యొక్క ప్రేరణచే, గర్భాశయము నుండి జన నేంద్రియము ద్వారా బయటికి వెల్వడును. అపుడు ఇంద్రియ దేవతలు భయపడ మొదలిడుదురు. తమ రక్షణ కొరకు వారు దాని యందు అన్నాహుతి వేయుదురు. దానితో రుద్రాగ్ని సంతాపము వలన ఏడ్చు శిశువు ఊరడిల్లును. ఇట్లు ఆ రుద్రాగ్నియే అన్న సంబంధముచే, శివమయి, సంసార రక్ష చేయును. అన్నాభావముచే నాశకారణమవును. ఈ రెండు భావములును సూర్యుని యందు అరయ గలము –

సూర్యుడు సాక్షాద్రుద్రుడు. ప్రాణులను సంతప్త మొనరించువాడు. వనస్పత్యాది అన్నములు ఇతని యందు, నిరంతరము, ఆహుతమవుచున్నవి. పార్థివ రసమును సూర్యుడు రశ్ములద్వారా గైకొనుచు, శివుడగు చున్నాడు. పైన చెప్పినట్లు పృథివి మాత, శక్తి; సూరుయడు తండ్రి, శివుడు, కాని ఈ శివుని శివత్వము, శక్తి సమన్వయముపై నాధారపడియున్నది. పార్థివాన్న సంబంధముతొలగెనా, ఆ సూర్యరుద్రుడు ఘోర రూపపరిణతి నొంది విశ్వమును భస్మప్రాయము గావించును. సౌర తేజము హిరణ్మయము. దీని సత్త సోమముపై ఆధారపడి యున్నది. ఇందు ప్రవేశించిన మహదక్షర రూపయగు చిచ్ఛక్తియే హైమవతి, ఉమ. దీనినే వాల్లభులు, చిచ్ఛక్తి అందురు. అద్వైతులు మాయ, ఉపాసకుల, రాధ, రామానుజీయుల, లక్ష్మీ, వైజ్ఞానికుల హైమవతి, ఉమ, ఇదే. –

'మమ యోని ర్మహద్బ్రహ్మ' అనుటచే పారేమేష్ట్య మహత్సోమమే అవ్యయ పురుషుడగు చిదాత్మకు ప్రతిష్ఠ. ఆ సోమము సౌర మండలగతమై, హైమవతి చిచ్ఛక్తిం గూడి (ఉమాసహితఃతత్వః) సోమము అనబడును. బ్రాహ్మణములందు ఈ ఉమయే, విషయభేదమున, అంబికా, అంబా, మాతా, జననీ, ధారా, జాయా, ఆపః అను ఈ మొదలగు పేరులం, బిలువబడుచున్నది. సౌరేంద్రుడు శివుడును, అతని శక్తి పార్థివ ప్రజ్ఞాసోమ రూప హైమవతియును, అయి యున్నారు. –

సోమము స్వరూపమున కృష్ణము (నలుపు) కాని సౌర విజ్ఞానమండలమునకు వచ్చి తదీయ దాహకత వలన ప్రకాశముగా నగును. సూర్యునందలి ప్రకాశము, ఈ సోమాహుతి ప్రభావమే. కనుకనే శ్రుతియు "త్వంజ్యోతిషావితమోవవర్థ" త్వమాతతం దూర్వంతరిక్షం" అనియెను. సోమము విశాలాకాశమున సర్వత్ర వ్యాప్త మగుచున్నది. ఈ సోమమయీశక్తి ఆచిద్ఘనా2 వ్యయపురుషుని ప్రకృతి; దీని జ్ఞానము ఇంద్రాది దేవతలకు ఆకాశమునందలి మహామాయా కృపా విశేషమున కలుగును. శక్తి పురస్కారము లేకుండ బ్రహ్మజ్ఞానము అసంభవము. ఉపనిషత్తును, ఈ శక్తి విజ్ఞానమును లక్ష్యముగా పెట్టుకొని "స తస్మిన్నే వాకాశే స్త్రియ మాజగామ బహు శోభమానా ముమాం హైమవతీం తాంహో

వాచ కిమేత ద్యక్షమతి సా బ్రహ్మేతి హోవాచ బ్రహ్మణోవా ఏత ద్విజయే మహీయధ్వమితి తతో హైవవిదాంచకారబ్రహ్మేతి॥ అనుచున్నది. గీతయు దైహీహ్యేషా గుణమయీ ఇత్యాదిగా వాకొన్నది. యుద్ధ కాలమందు విజయ ప్రాప్తికొరకు అజనేనుడు (అర్జునుడు) కృష్ణుని ఆదేశమున మొదట ఆశక్తి నారాధించి యున్నాడు. శివశక్తి మౌలిక రహస్యమిది. సౌరప్రాణప్రధానత వలన స్త్రీ సృష్టియగును. స్త్రీలందరు శక్తి రూపులు. పురుషులందరు శివరూపులు. విశ్వమంతయు శివశక్తిమయము. రెండునూ అవినాభూతములు. ఆగమశాస్త్రమునకు తల్లియగు భూమితో సంబంధము. కనుక అందు శక్తికి ప్రధానత. ఇక ఆగమవిద్యవంకకుమరలుదము.

# విద్యా రహస్యం

ఆగమాగమనము నిగమము నుండి అనుకొంటిమి. ఆగమ సిద్ధాంతములపై, నిగమ, సిద్ధాంతములు నిలచియున్నవి. నిగమమునకు తదాచార్యులు. "సైషాత్రయీవిద్య" అని విద్యాశబ్దమును ప్రయోగించినట్లు, ఆగమాచార్యులును ఆగమమునందు. "విద్యాసిసాభగవతీ" అని విద్యాశబ్దమును వాడిరి. నిగమమున త్రయీవిద్య, త్రయంబ్రహ్మ, త్రయోవేదాః। అనుటచే విద్యా బ్రహ్మ వేద శబ్దములు మూడును అభిన్నార్థకములు. పరమార్థమున అంతే కాని విశ్వదృష్టిచే మూడున్ను వేరు. మూడున్ను భిన్నములు. శక్తి తత్వము. విద్యా, మహావిద్యా, అని యెందుకు వ్యవహరింపబడినది? అను ప్రశ్న కుత్తరము, పై మూటి పరిజ్ఞానము పై నాధారపడి యున్నది. అనంత జ్ఞాన క్రియా అర్థఘన తత్వము యొక్క విశేషము పేరే అక్షర బ్రహ్మ. అది సర్వ జ్ఞాన క్రియా అర్థమయం. మరొక విధముగా ఆ అక్షర తత్వము మనః ప్రాణ వాఙ్మయము, క్షర పురుషునకు ఆధారము అక్షర పురుషుడైనట్లు సర్వాధారుడు పురుషోత్తమ నామ ప్రసిద్ధుడు అవ్యయపురుషుడు; అతడు స్వయముగా జ్ఞాన క్రియా అర్థ శక్తి స్వరూపుడు. అతని జ్ఞాన శక్తికి ఉక్థము (మూలము) మనస్సు. క్రియా శక్తికి ఉక్థము ప్రాణము. అర్థశక్తికి ఉక్థము వాక్కు, ఇట్లు మనః ప్రాణ వాక్కులు మూడే గాక ఇంకను ఆనంద విజ్ఞానము లను రెండు కళలు అతనికి గలవు. ఇవి అయిదు కోశములుగా తైత్తిరీయము నందు వర్ణితము. ఇందు వాక్కళ చివరది. ఇదే అన్న బ్రహ్మ. ఇట్లు పంచకళా2వ్యయ పురుషుడు, స్వయం శక్తి స్వరూపుడు. సరే, ఇక సామాన్యేసామాన్యా2భావః। కనుకనే అక్షరము కంటే పరమగు నీ తత్వమును శ్రుతి "దివ్యోహ్యమూర్తఃపురుషః స బాహ్యాభ్యంతరోహ్యజః। అప్రాణోహ్యమనశ్శుభ్రః అక్షరాత్పరతః పరః॥" అన్నది. అప్రాణమందు, అమనస్కమందు, క్రియలేదు. కనుక అవ్యయుడు కర్తృత్వ కరణత్వాది ధర్మ రహితుడు, సృష్టి విద్యకు బహిర్భూతుడు అగుటచే శ్రుతి "నతస్యకార్యం కరణంచ విద్యతే న తత్సమశ్చా2భ్య ధికశ్చ దృశ్యతే। పరాశ్యశక్తి ర్వివిధైవ శ్రూయతే స్వాభావకీ జ్ఞాన బల క్రియాచ॥" అన్నది. ఆ యీకారణముల వలన అవ్యయుని, నిర్ధర్మకు డందుము, అవ్యయుడు పురుషుడు, చేతనుడు, చిదాత్మ, జ్ఞానమూర్తి, కనుక నిష్క్రియుడు, క్రియాసాపేక్ష గల విశ్వనిర్మాణ బహిర్భూతుడు. –

సృష్టియన్నది సంసృష్టి, యోష, వృష యనబడు రయీ ప్రాణనామక తత్వ ద్వయసంయోగమే సృష్టి, సంసర్గము, వ్యాపారము, క్రియ, ఇది అవ్యయునందు లేదు గనుక, ఆయన అకర్త. కాని ప్రాణరూపిణి క్రియా శూన్యు డనగలమా? అయితే, కేవల క్రియ, ఏమియుం చేయజాలదు. క్రియావంతుడు చేయగలడు. అవ్యయుడన్ననో క్రియావంతుడు కాడు. క్రియా రూపి మాత్రమే. క్రియావంతుడు అక్షరుడు. ఈతత్వమే అవ్యక్తము. పరాప్రకృతి, పరమబ్రహ్మ మొదలగు పేర్లతో బిలవబడును. అవ్యయుడు ఈ ప్రకృతితో సమన్వితుడగును. "తత్తు సమన్వయాత్" అనునట్లు ఈ ప్రకృతి పురుష సమన్వయము వలన విశ్వ రచన జరుగును. అవ్యయశక్తులు అక్షరునందు సంక్రాంతము లగును. కాగా ఆ యక్షరుడు శక్తివంతుడై ఆనంద విజ్ఞాన మనః క్రియార్థవంతుడు అనుపించుకొనును.

మరియును పైన చెప్పిన అవ్యయ కళలందు ఆనందము ప్రసిద్ధమే. విజ్ఞానము చిత్తు, మనః ప్రాణవాక్కు ల సమిష్టి సత్త, ఈ మూటి మొత్తము సచ్చిదానందబ్రహ్మ, ఈ మూడుంగల అక్షరుని, ఆనందవాన్, విజ్ఞాన వాన్ అందుము. ఆనంద విజ్ఞానములు, ముక్తి సాక్షి అవ్యయుడు. ప్రాణ వాక్సమష్టి సృష్టి సాక్షి అవ్యయుడు. ఇక మధ్యనున్న మనస్సు "ఉభయాత్మకంమనః" అన్నట్లు రెండు వైపుల చెందగలదు. ఇందు ముక్తి సంబంధము ఆనంద విజ్ఞాన మనస్సు తోడను, సృష్టి సంబంధము మనః ప్రాణ వాక్కుల తోడనుకలదు. సృష్టి సాక్షియగు ఆత్మను గూర్చి శ్రుతి "సవా ఏష ఆత్మావాఙ్మయః ప్రాణమయో మనోమయః" అనివాకొన్నది. ఇక –

ఈవిధముగ సృష్టి సాక్షియగు అవ్యయుని యందు 1. జ్ఞాన ఘన మనస్సు, 2. క్రియా ఘన ప్రాణము, 3. అర్థఘన వాక్కు వీని సత్త కలదు గదా. మరి ఈ మూటియందును జ్ఞాన కళా వికాసము స్వయముగా అవ్యయుడు. అనగా అతని యందు ఈ కళకు ప్రధానత కలదని భావము. క్రియావికాసము అక్షర పురుషుడు. అర్థ వికాసము క్షరపురుషుడు, అనుకొన్నచో ఇందును జ్ఞాన ప్రధానావ్యయుడు నిష్క్రియుడే. అర్థ ప్రధాన క్షరుడున్నూ నిష్క్రియుడే, ఇక మధ్యనున్న అక్షరుడు మాత్రమే, సక్రియుడు. క్రియ అతని ధర్మము. కనుక అతనిని సృష్టికర్త యందుము. అవ్యక్త అక్షర ప్రకృతియే విశ్వ ప్రభవ ప్రతిష్ఠా పరాయణము. కనుకనే శ్రుతియు "యథా సుదీప్తాత్ పావకా ద్విస్ఫులింగాః। సహస్రశః ప్రభవంతే సరూపాః। తథాక్షరా ద్వివిధా స్సోమ్య భావాః। ప్రజాయంతే తత్రచైవాపి యంతి।" అన్నది. స్మృతి కూడ "అవ్యకాద్వ్యక్తయః" "అవ్యక్తా దీనిభూతాని" "అవ్యక్తోక్షర ఇత్యాహుః" అని "అక్షరంబ్రహ్మ పరమం" అనియు వాకున్నది. –

ప్రజాపతి (కుంభకారుడు) భూ పృష్ఠమున కూరుచుండి (సముదాయ రూపమున సర్వథా గతిసూన్యమగు అవయవ రూపము నుండి) సదా గతిసీలమగు చక్రముపై మృత్తిక నుంచి ఘట నిర్మాణము గావించునట్లు అక్షర ప్రజాపతి రూప కుంభకారుడు, ఆనంద విజ్ఞాన మనోఘన ముక్తి సాక్షియగు అవ్యయ రూప ధరాతలముపై కూరుచుండి, మనః ప్రాణ వాగ్ఘన సృష్టి సాక్షియగు అవ్యయ రూప చక్రముపై, క్షరరూపమృత్తికచే, ఉఖ్యత్రిలోకీ రూప ఘట నిర్మాణము నాచరించుచున్నాడు. త్రిభువన విధాతయగు నా యక్షర ప్రజాపతికినీ, బుధ్నముఖ రూప (ఉదర ముఖరూప) త్రైలోక్య భావాపన్న ఘట నిర్మాతయగు

మనుష్య ప్రజాపతికిని, నిరంతర ప్రతిస్పర్థ సాగుచున్నది. "ఘటానాం నిర్మాతుః త్రిభువన విధాతుశ్చకలహః" అని కలదు –

ఘట సృష్టికి ఏది క్రమమో ఈశ్వర ప్రజాపతి సృష్టికిన్నీ అదే క్రమము. ఈ విధ్య నెరుంగుటకే ఋషులు కుంభకారునకు ప్రజాపతి యని పేరిడిరి. పైన చెప్పబడిన క్షర పురుషుడు ఆ అవ్యయుని అపరాప్రకృతి. అక్షరుడు పరాప్రకృతి, అవ్యయుడు ఆలంబన కారణ. అక్షరుడు అసమవాయి (నిమిత్త) కారణము. క్షరుడు సమవాయి (ఉపాదాన) కారణం. ఈ మూవురిలో కర్త అక్షరుడే. అతడే క్రియామయుడు కదా. ఒక వంక చిదాత్మయగు అవ్యయుని జ్ఞాన భాగమును గ్రహించి సర్వజ్ఞుడుగా, వేరొక వంక క్షర రూప అర్థ భాగమును గొని సర్వవేత్తగా అగుచున్నాడు. క్షరముపాదాన మగుటచే బ్రహ్మ, "బ్రహ్మాక్షర సముద్భవం" అక్షరు నుండియే, క్షరబ్రహ్మ పుట్టుక. అవరబ్రహ్మ క్షరుడే. అక్షరుడు క్షరుని కంటే పరుడు. అవ్యయుని కంటే అవరుడు కనుక పరావరుడు నాబడును. వ్యక్త క్షరుని కంటే, అవ్యక్త అక్షరుని కంటే పరుడగుట వలన అవ్యయుడు పరుడనం బడును. మధ్య నున్న పరావరాక్షరుని యందు పరుడగు నవ్యయ సంపత్తియు బ్రహ్మయగు క్షర సంపత్తియు కలవు. కనుక ఇతనిని పరబ్రహ్మ అనవచ్చును. ఏ తత్ జ్ఞానము వలన, సర్వమును గతార్థమగును కనుకనే శ్రుతియు " ఏతద్ధ్యేవాక్షరం బ్రహ్మ ఏతద్ధ్యేవాక్షరం పరం। ఏతద్ధ్యేదాక్షరం జ్ఞాత్వాయోయ దిచ్ఛతి తస్య తత్।" "భిద్యతేహృదయగ్రంథిః ఛిద్యంతే సర్వ సంశయాః క్షీయంతే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే" అనుచున్నది. అవ్యయ, క్షర, అనుగృహీత అక్షరుడు సృష్టి కర్త యని సిద్ధమయ్యినది అక్షరుడు జ్ఞాన క్రియా అర్థయుక్తుడైనను క్రియార్థములకు పూర్ణ వికాసము క్రియార్థ ఘన విశ్వము నందే అగుచున్నది. సృష్టికి పూర్వము జ్ఞాన ప్రధానత మాత్రమే కలదు. కావుననే అక్షరుని తపస్సు కూడ (క్రియకూడ) జ్ఞానమయమే అందుము చేతన నామ ప్రసిద్ధుడగు అక్షరుడు అవ్యయ క్షరులు లేక యుండడు. కనుక సర్వజ్ఞుడు, సర్వవేత్త అగును. అట్టి అక్షరుని జ్ఞాన మయ తపస్సు వలన ఉత్పన్నమగు సృష్టి స్వరూపమేమి అన్నచో "యస్సర్వజ్ఞ స్సర్వవిత యస్య జ్ఞాన మయం తపః తస్మాదేతత్ బ్రహ్మ నామ రూపమన్నంచ జాయతే। అని శ్రుతి వాకొన్నది –

బ్రహ్మ। నామ రూప, అన్నములకు క్రమముగ ప్రతిష్ఠ, జ్యోతి, యజ్ఞము లని పేర్లు. సృష్టి యంతకు ఈ మూటియందు అంతర్భావము. అక్షరుడు మొదట ఈ మూడు రూపములయందు వికసితుడగును. ప్రతిష్ఠా తత్వము పేరు బ్రహ్మ జ్యోతిస్తత్వము పేరు ఇంద్రుడు. యజ్ఞతత్వము పేరు అన్నము ( విష్ణువు, అగ్నీషోములు) –

ప్రతిపదార్థమునందును మన కగపడు నిలుకడయే అస్తితత్వము స్తితి, ప్రతిష్ఠ. ఇదే సృష్టికి మూలాధారము – సృష్టి యన్నది స్థిర భావమునందే కాగలదు. గతి యొక్క ప్రతిష్ఠ స్తితియే. భూగర్భ ప్రతిష్ఠిత బీజమునకే అంకుర సృష్టి, గర్భాశయ ప్రతిష్ఠిత శుక్రము వలన గదా ప్రజా సృష్టి. ఉత్పన్న వస్తువులందు ఉత్పత్తి రూప క్రియకు ఆధారభూతమై మొదట ప్రతిష్ఠా బ్రహ్మయే ఉత్పన్నమగును. మొదట జన్మధారణ చేయునదియు వస్తు మాత్రమున కాధార మగునదియు ఈ తత్వమే. "బ్రహ్మవై సర్వస్యప్రతిష్ఠా।

బ్రహ్మవై సర్వస్యప్రథమజం। బ్రహ్మోదేవానాం ప్రధమస్సంబభూవ। విశ్వస్యకర్తా భువనస్యగోప్తా।” మొదలగు వచనములు ఈ తత్త్వ ప్రాముఖ్యమును వాకొనుచున్నవి. ఈ బ్రహ్మ (ప్రతిష్ఠా) తత్త్వమననేమి గతి సముచ్చయ మని సమాధానము. సర్వతోగతి లేదా దిగ్ద్వయగతి సమన్వయము, స్తితి; సమానబలము గల ఇరువురు మల్లుర యొక్క విరుద్ధ దిగ్గతి బలమున రజ్జువు స్తిరమగును, ఇదే మొదటి సృష్టి. కనుకనే “తస్మాదేతద్బ్రహ్మ” అని చెప్పబడినది. ఒక –

రెండవ సృష్టి నామ రూపాత్మకం, నామ రూపములు కర్మకు ఉపలక్షణముగా నెరుంగవలయును. ప్రతి వస్తువు నందును మొదట జనించునది ప్రతిష్ఠ. పిదప నామ రూప కర్మ సంబంధమున వస్తు స్వరూపము సంపన్నమగును. నామ రూప రహిత వస్తువు అంధ కారమందున్నది. వస్తు భాస (జ్ఞాన) మునకు నామ రూపములే కారణం. ఈ భాతియే జ్యోతిః. అయంఘటః ఇత్యాద్యా కారక వస్తు స్వరూప ప్రకాశకం. ఈ జ్యోతియే ఇంద్రుడు “రూపం రూపం మఘవాబోభవీతి” “ఇంద్రోరూపాణి పరేకృద చరత్” ఇత్యాది శృతులు ఇంద్రుని జ్యోతిర్మయునిగా చెప్పుచున్నవి. కనుక నామ రూపాత్మక జ్యోతి సృష్టిని ఇంద్రుడనవచ్చును. సరియే –

వస్తు స్వరూపము సంపన్నముకాగానే అందు ఆదాన విసర్గాత్మక యజ్ఞము ప్రారంభ మగు చున్నది. జడము కాని, చేతనము గాని అన్నియు నన్నము తినును. అన్నిటి యందు అన్నాహుతి నిరంతరము జరుగుచున్నది. అన్నము నాకర్షించు భావము పేరు విష్ణువు. ఈ అన్నయజ్ఞము విష్ణువు వలన అగును గనుక “యజ్ఞోవైవిష్ణుః। విష్ణుర్వై యజ్ఞ” అని శృతివాకొన్నది. 1. అన్నము నాకర్షించునది, 2. అన్నము 3. దేనియందు అన్నము ఆహుతమగునో అది. ఇట్లు మూడు శక్తులు మేళనమున యజ్ఞ స్వరూపము సంపన్నమగును. ఈ మూటిని వరుసగా 1. విష్ణువు, 2. సోమము, 3. అగ్ని అందురు. ఇట్లు అన్న రూప యజ్ఞమందు, మువ్వురు దేవతలు, అంతర్భూతులని సిద్ధమవుచున్నది. ఇదే మూడవ సృష్టి –

అక్షరుడు క్రియాఘనుడనుకొంటిమి. క్రియ యన గతి, కనుక అక్షరుడన గతితత్త్వము. ఈ గతియే పూర్వోక్త పంచ రూప ధారణ చేసుకొనుచున్నది. సముచ్చిత భావమున అది స్తితియై బ్రహ్మయనబడును. విక్షేపభావమున (గతిచే) అది ఇంద్రుడు (రుద్రుడు). ఆకర్షణ (ఆగతి) భావమున అదే విష్ణువు. గతియాగతులు స్వతంత్రములైనపుడు ఇంద్ర విష్ణువులు అవుదురని ఫలితార్థము – ఈ రెండును స్తితి రూప బ్రహ్మ తత్త్వగతములగుచో అగ్నీషోము లనబడుదురు. ఎట్లన, స్థితి గర్భితగతి (ఇంద్రుడు) అగ్ని. స్తితి గర్భిత ఆగతి (విష్ణువు) సోమము. ఇట్లు ఒకే గత్యాత్మక అక్షరము 1. గతిసముచ్చయము, 2. శుద్ధగతి, 3. శుద్ధ ఆగతి. 4. స్తితిగర్భితగతి, 5. స్తితి గర్భిత ఆగతి అను నైదు భావములొంది బ్రహ్మ, విష్ణు, ఇంద్ర, అగ్ని, సోమ నామము లొందుచున్నది. అనగా గతి తారతమ్యము వలన ఒకే అక్షరుడు పంచాక్షర రూపి అగుచున్నాడని భావము.

అ, ఇ, ఉ, ఋ, ఒ అను నైదక్షరముల నుండి శబ్ద సృష్టి వలె, పూర్వోక్త పంచాక్షరముల వల్ల, అర్థ సృష్టి యగుచున్నది. శబ్ద సృష్టి క్రమమే, అర్థ సృష్టికిని. శబ్ద బ్రహ్మ జ్ఞానము వలన, అర్థ బ్రహ్మ జ్ఞానము, గతార్థమగును. శబ్దార్థముల కభిన్న సంబంధము. అదియును ఉత్పత్తి సృష్ట సంబంధముగాని, ఉత్పన్న సృష్ట సంబంధము కాదు. బ్రహ్మ, సృష్టికర్త. ఇంద్రుడు (రుద్రుడు) సంహారకుడు, విష్ణువు, పాలకుడు. అగ్నీషోములు, ఉపాదానము. త్రిమూర్తులతో యజ్ఞ సంబంధమున్నంత వరకు ఇంద్రుడు (రుద్రుడు) శివుడుగా నుండును. యజ్ఞము ఉచ్ఛిన్నమగుచో నా ఇంద్రుడే ఘోరరూపియై విశ్వ సంహారమును చేయును.

ద్వాదశాదిత్య ప్రాణగతమై శాసకమై యుండి సర్వవ్యాపక అమృత స్వరూప అన్యతమప్రాణము యొక్క పేరే ఇంద్రుడు. కనుకనే ద్వాదశాదిత్య ఘనుడగు సూర్యుని, త్వష్ట, భగ, పూష, ఆదిత్య. ఆదినామములచే గాక "అథయఃసఇంద్రో2సౌసఆదిత్యః" ఏషవాఇంద్రోయ ఏషతపతి" అని ఇంద్ర నామముతోనే వ్యవహరింపుచున్నారు. ఈ సూర్య రూపేంద్రుడు అగ్నీషోములు అను నీ మూడును జ్యోతిర్మయ పదార్థములు. వీనిచే విశ్వము ప్రకాశితము. ఈ మూటి మష్టియు శివుడు, శివ స్వరూపము అన్న యజ్ఞముపై ప్రతిష్ఠితము. అగ్నీ షోమ సమన్వయము యజ్ఞము. ( అన్నమితి ద్వ్యక్షరం పదం) –

పురాణ శాస్త్రము. బ్రహ్మ, విష్ణ, శివ. అను త్రిత్వ విజ్ఞానము ప్రధానమనుచున్నది. నిగమ శాస్త్రము. బ్రహ్మాది పంచ విజ్ఞానముపై ప్రతిష్ఠితమై ఉన్నది. శైలిలో మాత్రమే భేదము. విషయమువకటే. పురాణము. ఇంద్రాగ్నీషోములను ఉన్ముగ్ధముగా నంగీకరించి ముప్వురను శివస్వరూపమున నిరూపణ చేయుచున్నది. వేదము ఈ ముప్వురను ఉద్బుద్ధ స్వరూపమున నిరూపించుచున్నది. –

చివరకు అక్షర తత్వము సృష్టి కాముకమై తన జ్ఞానమయ తపమున బ్రహ్మ, నామరూప, లేదా బ్రహ్మ నామ రూప, అన్న (యజ్ఞ) లేదా ప్రతిష్ఠా జ్యోతి, యజ్ఞ, లేదా బ్రహ్మాది పంచాక్షర రూపమున పరిణత మగుచున్నట్లు తేలినది. ఈ పంచాక్షరములందును. బ్రహ్మ, విష్ణ, ఇంద్రులు ముప్వురు హృదయ (కేంద్ర) ప్రతిష్ఠితులై దానిని సంచాలన చేయుచు అంతర్యామి నామ ప్రసిద్ధు లగుచున్నారు. ఇక అగ్నీషోముల వలన వస్తు స్వరూప సిద్ధి యగుచున్నది. కనుకనే. "అగ్నీషోమాత్మకంజగత్" అని శ్రుతియన్నది. పంచాక్షర పరిణతియే అక్షరుని ప్రథమసర్గము. –

ఈ అక్షర తత్వము ప్రజాసృష్టికి అధిష్ఠాతయగుటచే, ప్రజాపతి నాబడును "అర్థంహవై ప్రజాపతే రాత్మనో మర్త్యమాసీ దర్ధ మమృతం" అన్నట్లు ఆ ప్రజాపతి సగము భాగము అమృతము. అది ఎన్నడున్ను వికృతి నొందదు. అవిపరిణామి. సగము భాగముమర్త్యము. అగ్నీషోమాత్మకము. దాని నుండి వికార సృష్టి. ఈ రెండు భాగములే అక్షరక్షరములు. అమృత భాగము అక్షరము. మర్త్యభాగము క్షరము, దీని నుండియే విశ్వోత్పత్తి. ఇదే ఉపాదానము. అక్షరునకు గల బ్రహాది పంచకళలే ఈ క్షరునుకున్ను కలవు. అక్షరుని వ్యాపారము వలన ఈ బ్రహాదిపంచక్షరకళల నుండియు. క్రమముగా ప్రాణ, ఆప, వాక్కు, అన్న అన్నాదములను పంచవికారములు కలుగును. వీని నుండియే వైకారిక సృష్టి కలుగును. కనుక వీనిని విశ్వసృట్‌లు అందురు. పంచీకరణ మనబడు నీయైదింటి సర్వహుతయజ్ఞము వలన,

పంచజనములుత్పన్నము లగును. అర్ధభాగము ప్రాణము, మిగత నాలుగు భాగములును సగముచొప్పున, ప్రాణాది పంచకమయిదింట నైదు నాహుతము కాగా నుత్పన్నములగు పంచీకృత ప్రాణాదులే పంచజననామ ప్రసిద్ధములు. "వైశేష్యాత్తు ద్వాదస్తద్వాదః" అనుటచే వీనికిని ప్రాణః, ఆపఃవాక్కు, అన్న, అన్నాదములనియే పేర్లు. ఈ అయిదు పంచజనముల నుండియు, క్రమముగ, వేద లోక, ప్రజ, భూత, పశువులను పురంజనములుత్పన్నములగును. కనుకనే ఇవి పురంజనములు అనంబడును –

ఈ అయిదు పురంజనములందు, నన్నింటికి మూలాధారము, ప్రధమజము నగునది వేదము. విశ్వపుర ప్రధమాధారము వేదము కనుకనే "వేదశబ్దేభ్యఏవాదౌపృథక్సంస్థాశ్చనిర్మమే" అని మనువు చెప్పెను. ఈ పురంజన పంచకము నుండి క్రమముగ, స్వయంభు పరమేష్టి, సూర్య పృథివి, చంద్ర అను అయిదు పురము లుద్భవించును. తన క్షరభాగము నుండి విశ్వసృట్, పంచ జన, పురంజన, క్రమమున ఈ అయిదు పురముల నుత్పన్నములు గావించి "తత్సృష్ట్వా తదేవాను ప్రావిశత్" అను చొప్పున అవ్యయ, క్షరానుగృహీతమగు నాయక్షరాత్మ వీని యందు ప్రవిష్టమగుటచే "విశత్యస్మిన్నాత్మా" అను వ్యుత్పత్తిననుసరించి పంచబ్రహ్మ పుర సమష్టిపేరు విశ్వమనుట తగియున్నది –

1. ఆనంద, విజ్ఞాన, మనః ప్రాణ, వాక్కు భిన్న పంచకళావ్యయుడు.
2. అమృత, బ్రహ్మాదిభేదభిన్న పంచకళాక్షరుడు
3. మర్త్య బ్రహ్మాది భేద భిన్నపంచకతాత్మక్షరుడు

మరి విశ్వాతీత పరాత్పరుడు ఒక కళ. మొత్తము షోడశ కళాప్రజాపతి. ఇతని క్షర భాగమే విశ్వమయినది. కనుక విశ్వమునందు ప్రజాపతికంటే అన్యము లేదు. ఈ ప్రాజాపత్య విజ్ఞాన నిరూపణ చేయుచు వేద పురుషుడు "ప్రజాపతేనత్వదేతాన్యన్యో విశ్వాజాతాని పరితాబభూవ। యత్కామాస్తేజుహుమస్తన్నో అస్తువయంస్యామపతయోరయీణాం।" "యస్మాన్న జాతః పరోన్యస్తియ ఆవివేశ భువనాని విశ్వాప్రజాపతిః ప్రజయాసం రరాణ । త్రీణిజ్యోతంషి సచతే సషోడశీ।"

విశ్వేశ్వరుడు.

| షోడశీ ప్రజాపతీ | | –విశ్వము– |
|---|---|---|
| విశ్వాతీత పరాత్పరుడు | అవ్యయ అక్షరఅమృత. ఆత్మక్షర మర్త్య. | విస్వసృట్ పంచజన – పురంజన పురము |
| | 1. ఆనంద అమృతబ్రహ్మ మర్త్యబ్రహ్మ | శుద్ధ ప్రాణః పంచీకృతప్రాణః వేద స్వయంభూ |
| | 2. విజ్ఞాన అమృతవిష్ణువు మర్త్యవిష్ణు | శుద్ధ ఆపః పంచీకృత ఆపః లోక పరమేష్ఠీ |
| | 3. మనః అమృతఇంద్ర మర్త్యఇంద్ర | శుద్ధ వాక్కు పంచీకృతవాక్కు ప్రజా సూర్య |
| | 4. ప్రాణ అమృత అగ్ని మర్త్య అగ్ని | శుద్ధ అన్నాద పంచీకృత అన్నాద భూత పృధివీ |
| | 5. వాక్కు అమృతసోమ మర్త్య సోమ | శుద్ధ అన్న పంచీకృత అన్న పశు చంద్రమా |

ఒకే సౌర ప్రకాశము అద్దము నందలి రంగుల భేదమును బట్టి సోపాధికమై భిన్న భిన్న వర్ణములైనట్లు జ్ఞానఘన అక్షర ప్రధాన షోడశీ ప్రజాపతి విశ్వమందు, సంసృష్టుడై, సోపాధికుడగుచు, వేద, బ్రహ్మ, విద్య అను మూడు రూపములొందుచున్నాడు. విశ్వ సృష్టియందు ఈ మూడే రూపములు. 1. శబ్ద బ్రహ్మవేదతత్వం. 2. విషయ బ్రహ్మ బ్రహ్మతత్వం, 3. సంస్కార బ్రహ్మ విద్యాతత్వం. ఉదాహరణముగ ప్రజాపతి అంశభూతుడగు జీవ ప్రజాపతిని ఎదుట నుంచుకొందము. రామ, కృష్ణ, యజ్ఞ దత్త దేవదత్త మొదలగు నామములను వినుచుందుము. ఘట, పట, గృహ, మనుష్య, వన, ఉపవనాదులను, కనుచుందుము. శబ్ధము వలనను జ్ఞానము కలుగు చున్నది. పదార్థదర్శనము వలనను జ్ఞానము కలుగుచున్నది. ఈ రెంటను, శబ్ధా వచ్ఛిన్న జ్ఞానము వేదము. విషాయావచ్ఛిన్న జ్ఞానము బ్రహ్మ. ఈ రెంటి కంటే అతిరిక్తము అగు మూడవ జ్ఞానము ఇంకొకటి యున్నది. పై రెండును, సామాన్య జ్ఞానములు మాత్రమే. ఇవే ముందుకు సాగి, విశేష పరిణతి నొంది, సంస్కారమను పేరును దాల్చును. అనగా సామాన్య జ్ఞానమును కలిగించి, శబ్ద విషయములు లీనము కాగా ఆసామాన్య జ్ఞానమే అనుభవ ద్వారమున ముందుకు సాగి విశేష భావము నొంది ఆత్మ యందు ఖచితమై పోవును. దార్శనికులా దీనినే అనుభవాహిత సంస్కార మందురు. వైజ్ఞానికులు విద్య యందురు. పిమ్మటి వ్యవహార మార్గమూ దీని వలననే సాగును.

సంస్కారమున్నంతవరకే స్వరూప ప్రతిష్ఠ. తదభావము విశ్వాతీత స్తితి, ముక్తి. విశ్వసత్త సంస్కారసత్తపై ఆధారపడియున్నది. కనుకనే, శబ్ధరూపవేదము, విషయరూప బ్రహ్మ అను నీ రెంటి కంటే, సంస్కార రూప విద్యనే ప్రధానముగ, విశ్వ స్వరూప సంపాదిక అందుము. ఆ జ్ఞానముపై చితిక్రమమున సంస్కారపుట లగ్నత వలన విశ్వము సిద్ధమగును. న విశ్వము మన సంస్కారమైనట్లే ఈ మహావిశ్వము దాని సంస్కారము. కనుక విశ్వమును విద్యయందుము. ఇంతకు ఆ జ్ఞాన మూర్తి సంస్కారము. కనుక విశ్వమును విద్యయందుము. ఇంతకు ఆ జ్ఞానమూర్తి సంస్కారావిచ్ఛినమగుచు విద్యగా, శబ్ధావచ్ఛిన్నమగుచు వేదముగా, విషయావచ్ఛిన్నమగుచు బ్రహ్మగానైయున్నదని తేలినది. –

పై వ్రాత వలన సృష్టి సంబంధము విద్య తోడనే కలదు కదా. విశ్వ నిరూపణ చేయునది, నిగమాగమములు రెండే. ఇవి విద్య లందురు. సూర్య, చంద్ర, అగ్న్యాదులు, ఓషధి వనస్పత్యాదులు, క్రిమి, కీటక, పశు, పక్షి, మనుష్యాదులు, ధాతురసోపరసాదులు, వీని యందు ప్రతి పదార్థము ఒక్కొక్క విద్యయే. కాని ఇవి విశ్వాంతర్గత క్షుద్ర విద్యలు. సంపూర్ణ విశ్వ విద్య మహావిద్య. దానిని సృష్టి క్రమానుసారము ఋషులు దశధావిభక్తముగా నెంచిరి. నిగమమునందే, దశావయవ విద్య విరాడ్విద్య అనబరగెను. ఆగమము, దీనినే మహావిద్య అనెను. ఆగమోక్తతత్వము, మహావిద్య ఇది పది విధములు.

# దశ సంఖ్యా రహస్యం

పై ప్రకరణమున పురుష ప్రకృతి సమన్వయమున విశ్వ రచన చూపబడినది. ఆ పురుషునకు, కాల, యజ్ఞ భేదమున రెండు వివర్తములు. కాల పురుషుడు అనాది, వ్యాపకుడు, యజ్ఞ పురుషుడు. సాది, పరిచ్ఛిన్నుడు, వ్యాపకుడగు కాల పురుషుని యత్కించిత్ప్రదేశమే పరిచ్ఛిన్నమై యజ్ఞ పురుష డనంబడును. కాల పురుషుడు సృష్టికి ప్రథమ ప్రవర్తకుడు. యజ్ఞపురుషుడును, కాల పురుషుని సాయముగొనియే స్వయముగా విశ్వనిర్మాణ సమర్థ దగుచున్నాడు. ఆ మహాకాలోదరమున అనంత విశ్వ చక్రములు భ్రమణము చేయుచున్నవి. మంత్ర సంహిత లందు కాల మన బడునదే ఉపనిషత్తులందు పరాత్పరుడనంబడును. సర్వామృత మృత్యు ఘనతత్వమే పరాత్పరుడు. అమృత తత్వముసత్తు. మృత్యుతత్వము అసత్తు "అంతరంమృత్యోఃరమృతంమృత్యావమృతమాహితం" "తదంత రస్య సర్వస్య తదుసర్వస్యాస్యబాహ్యతః" అన్నట్లు రెండును రెంటను ఓతప్రోతములు. ఒక తత్వము నిరంజన నిర్గుణ శాంత శాశ్వత అభయ పూర్ణమృత్యు లక్షణం. రెండవది సాంజనసగుణం, అశాంత అశాశ్వత సభయ అపూర్ణ స్వలక్షణం. తమః ప్రకాశముల వలె అత్యంత విరుద్ధములయ్యును ఈ రెండును అవినాభూతములు. రెంటిలో, నేది ఆధారము. ఏది ఆధేయు నిర్ణయింప జాలము. అంగుళియందు క్రియయా, క్రియ యందు అంగుళియా, అసమాధేయప్రశ్న. రెంటి యందును సర్వథాఒకే సత్తుకలదు. దానికి నాశ మెన్నడున్నూ లేదు. ఇక రెండవది సర్వథా అసత్తే వినాశమే దాని స్వరూపము. సదస ద్రూపా2మృత సమష్టియే ఆ కాలపురుషుడు. ఈ ఆధారముననే "అమృతంచైవమృత్యుశ్చ సదస చ్చాహమర్జున" అనుటయు సంగత మగుచున్నది. అది సత్ కాదు. అసత్ కాదు, సదసత్‌కాదు. మరేమి వేద పురుషుడిట్లనుచున్నాడు "నైవవాఇదమగ్రే2సదాశీత్ నైవసదాశీత్ ఆశీదివవాఇదమగ్రేనైవాసీత్ తస్మాదేతత్ ఋషిణాభ్యుక్తం నా సదాసీన్నో2సదాసీత్త దానీం" ఈ విలక్షణ తత్వానామమే పరాత్పరుడు. ఇదే కాలపురుషుడు, ఆ యసీమ పరాత్పరుని యందు ప్రతి క్షణ విలక్షణ ధర్మము గల మాయాబలముల ఉదయ మగుచున్నది. దిగ్దేశకాలములచే సాంతములయ్యు సంఖ్య యందు అనంతము లగు బుద్బుదములు ఉత్తర క్షణమున సముద్రము నందే లీనమగునట్లు దిగ్దేశకాలములచే అనంతమయ్యు సంఖ్య యందేకమగు నా యమృత సముద్రము నందు దిగ్దేశకాలములచే సాంతమయ్యు సంఖ్య యందనంత సీమాభావోత్పత్తిం జేయు అనంత మాయాబలములు ప్రతిక్షణము ఉత్పన్నములు అగుచు ఉత్తరక్షణమున దాని యందే లీనములగుచున్నవి. శాంత రసము, నిత్యఅశాంతియుక్తము, అశాంతి గర్భిత నిత్య శాంతియే దాని స్వరూపము శాంతామృత తత్వము కంటే అది సర్వథా కంపరహితము, అశాంత మృత్యుతత్వము కంటే అది సర్వథా కంప రూపము, గతి రూపము, దాని ఈ అచింత్య రూప నిరూపణ చేయుచు శ్రుతి ఇట్లనుచున్నది. "అనేజదేకంమనసో జవీయో నైనద్దేవా ఆప్నువన్ పూర్వ మర్షత్ తద్ధావతో2న్యానత్యేతితిష్ఠత్" "తదేజతి తన్నైజతి తద్దూరే త ద్వంతికే తదంత రస్య సర్వస్య తదు సర్వస్యాస్య బాహ్యతః" ఏ మాయాబలము ఆ అ సీమునిససీముని చేసి వేయుచున్నదో దేని ప్రభావము వలన విశ్వాతీత, విశ్వచర, విశ్వసృష్టు లేర్పడుచున్నవో, ఏ శక్తి (బలము) కాలమును యజ్ఞరూపము చేసి వేయుచున్నదో,

ఆ మహామాయ యొక్క సమన్వయము వలననే ఆ కాలపురుషుడు తన యత్కించిత్ప్రదేశముచే సీమితుడై కామనా చక్రమున చిక్కు కొనుచున్నాడు. ఒక్కొక్క మాయ వలన ఒక్కొక్క విశ్వ చక్ర ముప్ప తిల్లును. మాయా బలంములు అనంతము. విశ్వ చక్రములు అనంతములు. తదీయ రోమరోమ కూపమునను ఒక్కొక్క బ్రహ్మాండమున్నది. ఆ యనంత విశ్వాధిష్ఠాత ఆ కాలపురుషుడు నియతి రూప ఖడ్గమును చేగొని విశ్వముపై శాసనమునేరపు చున్నాడు. సప్త లోకములు చతుర్దశ భూత సర్గము. విశ్వ చక్రము లన్నియు, వేయేల, సర్వము, నతని నుండియే యుత్పన్నమయినది. ఈ సంపూర్ణ కాలపురుషుని నిరూపించు నీ యాథర్వణశృతి ఇట అవధేయము. కాలోఅశ్వోవహతిసప్తరశ్మిః సహస్రాక్షోఅజరోభూరిరేతాః తమారోహంతికవయోవిపశ్చితః తస్య చక్రా భువనాని విశ్వా స ఇమా విశ్వాభువనాన్యంజత్ కాలస్సఈయతే ప్రథమోనుదేవః సఏవ సంభు వనాన్యాభరత్ సఏవ సంభువనాని పర్యైత్ పితాసన్నభవత్ పుత్ర ఏషాంతస్మాద్వైనాన్యత్పరమస్తి తేజః కాలో2 మూం దివమజనయత్ కాల ఇమాపృథివీ రుత కాపాలే భూతం భవ్యం చేషితం హవితిష్ఠతే కాలేతపః కాలేజ్యేష్ఠం కాలే బ్రహ్మ సమాహితం కాలోహసర్వస్యేశ్వరః యః పితాసి తత్రృజాపతేః కాలః ప్రజా అసృజతకాలో అగ్రేప్రజాపతిం స్వయంభూః కశ్యపః కాలాత్ తపః కాలాదజాయత కాలోయ మంగిరోదేవః అథర్వాచాధి తిష్ఠతః ఇమంచ లోకం పరమంచ లోకం పుణ్యాశ్చలోకాన్ విధృతీశ్చ పుణ్యాః సర్వాన్లో కాన్ అభిజిత్స్రబ్రహ్మణాకాలః స ఈయతే పరమోనుదేవః ఇత్యాది" –

అనుపాఖ్య, అనిరుక్త, నిరుక్త భేదములచే, తమస్సు మూడు విధములు (1) నల్ల రంగు, బొగ్గు, బూడిద, ఇత్యాదికము నిరుక్తము. దీనిని నిర్వచింపవచ్చును. (2) రాత్రి యందలి చీకటి, కన్నులు మూసినప్పటి చీకటి, అనిరుక్తం. ప్రత్యక్షమే కాని, దీనిని నిర్వచింప జాలము. 1. నిరుక్తము విశ్వసత్త అహఃకాలము, సృష్టి. 2. అనిరుక్తం రాత్రి కాలము ప్రళయము, సరియే అహోరాత్ర సమష్టి విశ్వము. ఇక ఈ రెండునూ కాని, విశ్వాభావమనగానేమి. ఇదే అనుపాఖ్య తమస్సు. ప్రళయకాలము నందు ఇది అనిరుక్త తమస్సుచే ఆ వృతమై ఉండుచున్నది. ఈ విజ్ఞానమును, గురి చేసుకొని శృతి "తమ ఆసీత్ తమసాగూఢమగ్రే2ప్రకేతం సలిలం సర్వమా ఇదం" అనుచున్నది.

ఈ విశ్వాతీత అనుపాఖ్యతమస్సే మనకు పరిచయుడగు కాలపురుషుడు. ఈయన వీశ్వాభావ రూపుడు, కనుకనే సద్రూపుడైనను, మన జ్ఞాన చక్షువున కతీతుడగుట వలన ఋషి దానిని అసత్ అనుచున్నాడు. దానికి అభావము అర్థము కాదు. విశ్వకాలమున అయ్యది ఈ విశ్వము కంటే విలక్షణమైన, సత్తనియే తాత్పర్యము. ఈ అభిప్రాయమున్ననే "అసదేవేదమగ్ర ఆసీత్ తత్సదాసీత్ కథమసతస్సజాయేత" ఇత్యాదులు సంగతములు అగుచున్నవి. ఆ అసత్తైనసత్తుకాలపురుషుడు స్వకీయ మహామాయ వలన పరిచ్ఛిన్నుడగును. అపరితము నందు దేనికిని అభావము లేదు. అతడాప్తకాముడు కావున, అప్రాప్త వస్తు ప్రాప్తి అతని యందు కలుగదు. ఆవ్యాపకునందు సర్వమును కలదు. కనుక అతని యందు కామనలేదు కాని –

అతని మాయీ ప్రదేశము సీమితమై అనాప్తకామ మగుచు కామమయ మగుచున్నది. అతని కామనకు "ఏకోహంబహుస్యాం" అనునదే స్వరూపము. మాయాబల అవ్యవ హిత ఉత్తరకాలమందే అతని యందు హృదయ బలము (కేంద్రశక్తి) ఉత్పన్నమగుచున్నది. అప్పుడు రస బలాత్మక తత్త్వము కామనా మయమగుచు మనస్సు అను పేరొందుచున్నది. కామన మనోవ్యవహారము, మనస్సు హృదయ ప్రతిష్ఠితముగదా (హృత్పృతిష్ఠం) అన్నింటి కంటే ముందు ఈ మనస్సు నుండి విశ్వరేతోభూత (ఉపాదానశు క్రభూత) కామనోదయము అగుచున్నది. ఋషియు "కామస్తదగ్రే సమవర్తతాధి' మనసో రేతః ప్రథమం యదాసీత్" అనుచున్నాడు. అతని ఈ కామనవలనపైన చెప్పబడిన పంచజనాది క్రమమున మొదట వేద పురంజనమే ప్రాదుభర్ వించుచున్నది.

ఋగ్ యజుస్సామాథర్వభేదమున వేదము నాలుగు విధములు. త్రయీ వేదము - అగ్ని వేదము. అథర్వము సోమ వేదము, త్రయీబ్రహ్మ స్వయంభూ బ్రహ్మ. అథర్వణము పారమేష్ఠ్య సుబ్రహ్మ. బ్రహ్మ ఆగ్నేయ మగుటచే పురుషుడు. సుబ్రహ్మసౌమ్యమగుటచే స్త్రీ. త్రయీ బ్రహ్మ మధ్యనున్న యజుర్భాగమున యత్, జూ, అను రెండు భాగములు కలవు. యత్ అనునది గతి తత్త్వము. జూ అనునది స్థితి తత్త్వము. ఇదే వాక్కు, ఆకాశము, అను పేరుల పిలువబడును. ప్రాణ వాక్కులు లేదా వాయు వాకాశములు లేదా స్తితి, గతి తత్వములు అను వాని సమష్టియే యజుర్వేదము. ప్రాణ రూప, యత్ యొక్క కామ, తప, శ్రమల వలన వాగ్రూప, జూ, భాగము నుండి మొదట జలముత్పన్న మగుచున్నది. కనుకనే "సో2పో2సృజతవాచయేవలోకాత్।" "ఆప ఏవససర్జాదౌ" అని శ్రుతి. స్మృతులు చెప్పుచున్నవి. త్రయీబ్రహ్మ వాగ్భాగము నుండి పుట్టిన ఈ ఆపోతత్వము పేరు అధర్వవేదము, యజూరూపస్వాయంభూ బ్రహ్మ యొక్క స్వేదమే (సువేదమే) అధర్వణ వేద రూప సుబ్రహ్మ (గోపథం) ఇచట యాజ్ఞవల్క్యవచనములు కూడ అవధేయుములు. "అయమేవాకాశూజూః । యదిదమంతరిక్షం, యదేత ద్యజుః। వాయుశ్చాంతరిక్షంచ। యచ్చజూశ్చతస్మాద్యజుః। తదేతద్యజుః। ఋక్సామయోః ప్రతిష్ఠా। ఋక్సామేవహతః।" ఇట్లు ఋక్కు, సామయత్। జూ। వేదమున అగ్ని వేదము చతుష్కళమగును.

రెండవదగు ఆపోమయ సోమవేదము (అధర్వము) భృగు, అంగిరా భేదమున రెండు భాగములు. ఇందు భృగువు. ఘన, తరళ, విరళ, అవస్తలవలన, ఆపః వాయుః, సోమ అను మూడు విధముల పరిణమించును. ఇట్లే, అంగిరయు అగ్ని, యమ, ఆదిత్య యని మూడు విధములగును. కాగా ఆపోవేదము, ఆరు కళలు గలది అనవచ్చును. భృగ్వంగిరో రూప ఆపోవేదముతో పై చెప్పబడిన చతుష్కళ త్రయీ వేదమునకు సమన్వయమగును. దీనిని గురించి శ్రుతి "ఆపోభృగ్వంగిరోరూపం। ఆపోభృగ్వంగిరోమయం। అంతరేతే త్రయోవేదాః। భృగూనంగిరసశ్రితాః।" అన్నది ఆ షట్కళ సుబ్రహ్మ, సౌమ్యమగుట వలన స్త్రీ, చతుష్కళ త్రయీ బ్రహ్మ, ఆగ్నేయ మగుటచే పురుషుడు. ఈ ఇరువురి సమన్వయమునను, బ్రహ్మ సుబ్రహ్మాత్మక, విరాట్పురుష జన్మము కలుగును. అనగా వేదమూర్తి పూర్ణ పురుషుడు. తన్ను రెండు భాగములు చేసుకొని విరాటునుత్పన్నము గావించునని భావము. కనుకనే మనువు "ద్విధాకృత్వాత్మనోదేహం

అర్ధేన పురుషోభవత్। అర్ధేన నారీతస్యాం సః విరాజమసృజత్ప్రభుః" అనియెను. ఋక్కు, సామ, యత్, జూ, ఆపః, వాయుః, సోమ, అగ్ని, యమ, ఆదిత్య, భేదమున ఆ విరాట్ దశకళుడు. ఇంతకు పూర్వోక్తుడగు ఆ అక్షర ప్రజాపతియే, వేద రూపమున దశకళుడుగ, పరిణతుడగునని భావము. అందుకే "దశాక్షరావైవిరాట్" అనువచనము వెలశినది.

అగ్నీషోమ రూప బ్రహ్మ, సుబ్రహ్మల సమన్వయమున, నుత్పన్నుడగు, నీవిరాట్పురుషుని, యజ్ఞపురుషుడందురు. అగ్నీషోమ సంబంధ నామమే, యజ్ఞము. కాల పురుషుని అవయవభూతుడగు దశాక్షర విరాట్పురుషుడే రెండవ వాడగు యజ్ఞపురుషుడు. సృష్టికర్త, "తంమాంవిత్తాస్యసర్వస్యస్రష్టారం ద్విజసత్తమాః" అని మనువు ఇతని నుండియే ప్రజోత్పతి, కనుక, నితనిని, ప్రజాపతి యందుము. విశ్వమందలి ప్రతిపదార్థమును యజ్ఞపురుషుడు, అగ్నీషోమాత్మకము, విరాడ్రూపము, కనుక ప్రజాపతి స్వరూపము, ఆవిశ్వరూప విరాట్ప్రజాపతి, దశావయవుడు. కనుక ఈ ప్రాజాపత్య విద్యను పూర్వోక్త నిగమ విద్యాధారమున దశావయమనబడును. దీనినే, దశహోతా, దశాహా, మొదలగు నామముల బిలుతుము. సమస్త విశ్వ ప్రతిష్ట ఇదే. ఈ క్రింది శృతి వాక్యములు ఇచట పరిశీలింపదగినవి. 1. యజ్ఞోవై దశహోతా, 2. విరాడ్వా ఏషా సమృద్ధాయద్దశాహాని, 3. విరాడ్వైయజ్ఞః, 4. దశాక్షరావైవిరాట్, 5. యజ్ఞఉవైప్రజాపతిః, 6. ప్రజాపతి ర్వై దశహోతా, 7. అతోవాఏష యజ్ఞ స్యయద్దశమహః, 8. ప్రతిష్ఠాదశ మహః, 9. ఏతద్వై కృత్స్నమన్నాద్యంయద్విరాట్, 10 విరాట్ విరమణాత్ విరాజనాద్వా –

సరియే, ఇక "న్యూనాద్వా ఇమాః ప్రజా ప్రజాయంతే" అను నీశ్రౌత సిద్దాంతానుసారము న్యూన విరాట్టువలననే సృష్టి యగుచున్నది. పురుషద్వయ, స్త్రీద్వయ సంయోగము వలన సృష్టి అసంభవము. స్త్రీ సౌమ్య, కనుక భోగ్య, పురుషుడు ఆగ్నేయుడు, కనుక భోక్త, స్త్రీ కంటే ప్రబలుడు. స్త్రీ పురుషుని కంటే న్యూన ఈ న్యూన సంబంధమువలననే ప్రజోత్పత్తి. అటు విరాట్టు నందు త్రయీబ్రహ్మ ఆగ్నేయుడు కనుక భోక్త. సుబ్రహ్మ సౌమ్య కనుక స్త్రీ; బ్రహ్మ ప్రాణము. సుబ్రహ్మ రయి (ప్రశ్నోపనిషత్) ఇంతకు దశాక్షర పూర్ణ విరాట్టు నుండి సృష్టికాదు. నవాక్షరన్యూన విరాట్టునుండియే సృష్టి యగునని తాత్పర్యం –

"నవైఏకాక్షరేణఛందాసి వియంతినద్వాభ్యాం" అను శ్రౌత సిద్ధాంతానుసారము, ఒక అక్షరము తక్కువ అయినను విరాట్టు యొక్క విరాట్త్వమునకు లోపము రాదు. ఇక అన్నిటికి, లేదా అంతటికి ముందు ఏమున్నది. (సూన్య) బిందు మాత్రము, బిందు వన సూన్యమని కాదు. పూర్ణమనియే అర్థము. జ్యోతిష్కులు ఈ విజ్ఞానమునెరుంగుదురు. వారు సూన్యమును, పూర్ణము, శుద్ధము నందురు. ఇది బ్రహ్మాక్షరము యొక్క మొదటి యున్ముగ్ధరూపము. దాని నుండి నవాక్షర ప్రజాపతి యుత్పన్నుడగును. యత్, జూ, ఉన్ముగ్ధ రూపమనుకొన్నచో పూర్వోక్త విరాట్ తొమ్మిది అక్షరములు వాడే అగును. అసలు సంఖ్య తొమ్మిదియే, కనుక తొమ్మిదియే ప్రధానము. మొదటను సూన్య బిందువు. దాని నుండి క్రమముగ ఒకటి రెండు చొప్పున తొమ్మిది వరకు వికాసము. అంతటితో సంఖ్యా సమాప్తి తోడనే సూన్యముతో ఒకటికి సంబంధం అదే పది. మరల 11 మొదలు 19 తో సమాప్తి. పిదప సూన్యము రెండుతో

కలియును. ఇట్లే అంతటను 9 తో సంఖ్యకు అవసానం. తొమ్మిది తప్ప తక్కిన అంకెల సంకలన ఫలము సమానము కాదు. తొమ్మిది నుండి ఒక్కొక అంకెను వేరు చేయుడు 8 ది కలుపుడు పద్దెనిమిది అగును. రెండు + ఏడు 3+6 6+3 7+2 8+1 ఈ క్రమమున చివరకు తొమ్మిదియే మిగులును. 9+9=18 1 + 8 = 9, 3 × 9 = 27 2 + 7 = 9 ఇట్లు ఊహింపుడు. చివరకు తొమ్మిదియే మిగులును. పదవది పూర్ణరూపమే, అదే మహాకాలనామ, విశ్వాతీత పరాత్పరుడు. ఆ సూన్య రూప పురుషుని గర్భమున నవాక్షరరూప విరాడ్యజ్ఞ పురుషుడు నిండి యున్నాడు. పై పూర్ణ రూపమును పదియవ దగు ప్రతిష్ఠానామక. అహః సూచించును. ఈ పూర్ణేశ్వరుని శ్రుతి ఇట్లు నిరూపించును. "యస్మాత్పరంనాపరమస్తికించిత్। యస్మాన్నాణీయో న జ్యాయోస్తికశ్చిత్ । వృక్షఇవస్తబ్ధో దివి తిష్ఠత్యేకః । తేనేదంపూర్ణం పురుషేణసర్వం" ఇది విరాడ్బ్రహ్మ విశ్వేశ్వర నిరూపణము –

మరియు భూపిండ హృదయ ప్రదేశమునుండి దాని అంశమగు వాక్కు యంత దూరము బయటకు పోవునో ఆ ప్రదేశము. 33 భాగములు చేయబడినవి. అందు భూపిండ హృదయమునుండి తృతీయ భాగము చివరి వరకు నైన వాగ్భాగమును. శ్రాయయంతీయం సామ అందరు. అదే శరీరం. శీర్యత ఇతి శరీరః అనుట, దహ్యత ఇతిదేహః అనుటయు, అవైజ్ఞానికములు – దిహ ఉపచయే. అనగా వృద్ధియని అర్థము. కనుక ఆధాతువు నుండి దేహము పుట్టినది అని, యరుగవలయును. ఇక శ్రాయయంతీయం సామయే శరీరమయినది. అది భూపిండము నుండి బయలు వెడలు వాక్కు యొక్క 33 భాగములందు మొదటి 3 భాగములు మాత్రమే. తక్కిన ముప్పై భాగములందు, ఆరేసి భాగములు ఒకొక గుంపుగ, అయిదుగుంపులగును. వీనినే పంచస్తోమములందురు. మొదటి భాగము త్రివృత్ ( 3+6 = 9) స్తోమము. ద్వితీయ భాగాంతము పంచదశ (15) స్తోమము తృతీయ భాగాంతము ఏకవింశ (21) స్తోమము చతుర్ధ భాగాంతము త్రిణవ (21+6 = 27) స్తోమము పంచమ భాగాంతము త్రయస్త్రింశ (27+6 = 33) స్తోమము. ఇందు శరీర పిండాంతము మర్త్యాగ్ని, ఏకవింశతిస్తోమాంతము అమృతాగ్ని, తక్కిన స్తోమములు రెండును సోమభాగములు. ఇట్లు అగ్నీషోమాత్మకం జగత్ అను వేద సిద్ధాంతము వైదిక సిద్ధాంతము ప్రసిద్ధమగుచున్నది. ఇచట త్రివృత్, పంచదశ, ఏకవింశాంతం చెప్పబడిన అమృతాగ్నికి, వరుసగా అగ్ని, వాయు, ఆదిత్య అని మూడు భేదములు. ఈ దేవతలచే ప్రవర్త మానములగు మూడు వేదములు క్రమముగ, ఋక్కు, యజస్సు, సామము అని పిలువబడి తత్త ద్రూపములగుచున్నవి. ఎట్లన, అగ్ని నుండి బయలుదేరి ఆదిత్యాంతము వితాయమానమగు వాక్కు ఋక్కు అనియు, ఆదిత్యునుండి తిరిగి వచ్చు వాక్కు సామయనియు, ఈ ఋక్సామములమధ్య, స్తితి గతి, రూపములనున్న వాక్కు, యజుస్సు అనియు, వ్యవహారము, యజుస్సన, గతిరూపమయిన వాయువు యత్ । స్థితి రూపమయిన ఆకాశము, జు, ఈ రెండు దేనివలన సంధిల్లునో ఆవాక్కు యజస్సు. అగ్ని, వాయు, ఆదిత్య రూపముల ఈ వాక్కు ఋక్సామయజస్సులుగా అగ్ని తత్వమేయగుట వలన వేద త్రయి అని వేరుగా నొక విభాగము – ఇక ఏకవింశతిస్తోమమున కూర్ధ్వమత్రయ స్త్రింశస్తోమాంతము వితాయమానమగు (విస్తరిల్లు) సౌమ్యసుబ్రహ్మణ్య వాక్కు అథర్వవేదము. ఇట్లు అపౌరుషేయములు నాలుగు వేదములనియు నెరుంగ వలెను.

ఇక అనంతవేదములు అనుటను గూర్చియు, ఈ వేదములందలి, శాఖాభేదములను గూర్చియు, ప్రస్తుత మంతగాపనిలేకుండుట వలనను, గ్రంథ విస్తర భయమునను, వివరణములు విడువబడినవి. మరియు బ్రహ్మయన వేదము, మంత్ర రూపము, దాని వ్యాఖ్యాన రూపము బ్రహ్మణము. ఈ రెండును ఏకముగా "మంత్రబ్రాహ్మణము, విధి, ఆరణ్యకము, ఉపనిషత్ అని మూడు భాగములు. అయినను ఈ వ్యవహారము అందలి క్రియా కలాపముల ప్రాధాన్యాప్రాధాన్యతలను బట్టి వెలశినది గాని, మూడింటి యందును, మూడును, కలవు అని యెరుంగవలయును. ఈ మూడును వరుసగా, కర్మ, ఉపాసన, జ్ఞానములను గూర్చి ప్రధానత వహించుచుండును. కానీ ఈ అన్నింటికిన్నీ ఉపనిషత్తులు కలవు. ఈ మూడింటికిని అనగా కర్మ, ఉపాసనా, జ్ఞానములందు, ఏది, ఎప్పుడు, ఎందుకు, ఎవరు, ఎట్లు, చేయవలెను. ఆయా చేతవలన కలుగు ఫలము ఎందుకు, ఎట్లు లభించును. అను దానిని గూర్చి చెప్పునట్టి ముఖ్య సిద్ధాంత వాక్యము, ఉపనిషత్ అనబడును. చివరకు, కర్మకు గాని, ఉపాసనకు గాని, జ్ఞానమునకు గాని సహేతుక సారాంశములు ఉపనిషత్తులనబడును.

## ఋషి విజ్ఞానము

వేదములందు ఋషి విజ్ఞానము నాలుగు అర్థముల యందు కనబడుచున్నది. 1. అసల్లక్షణము, 2. రోచనాలక్షణము, 3. ద్రష్టులక్షణము, 4. వక్తృ లక్షణము అని ఎట్లన, సత్తు, అసత్తు, సదసత్తు అని బ్రహ్మ మూడు విధములు. సత్తు అనగా వాక్కు. అసత్తు అన్నది ప్రాణము. సదసత్తన్నది మనస్సు, వాక్ప్రాణ మనస్సులన్నియు కర్మ బ్రహ్మ యందలివి. ప్రాణ యుక్తము లయిన వానియందే సత్తయగు పడుచున్నది. ప్రాణమన్నది స్వయముగా అప్రాణము. కనుక దాని నసత్తందురు. ఈ ప్రాణము లనేక విధములు. వాని ఘనత్వము నందు పురుషశబ్ధము రూఢమైయున్నది. అది రెండు విధములు. 1. అనేక జాతీయము లగు ప్రాణముల సమిష్టి యొక్కటి. విజాతీయస్పృశ్యన్ లేక ఏకజాతీయ ఘన మగునది మరియొకటి. ఈ రెండింటిలో మొదటి దాని యందు దేవశబ్దము. రెండవ దాని యందు ఋషిశబ్దము రూఢములు. దేవతలున్నూ ప్రాణములే, ఋషులున్నూ ప్రాణములే, కాని దేవతలు ఋషులు కారు. ఋషులు దేవతలు కారు. యచ్చుటనైనను. ఇంద్రాదులగు దేవతలకు ఋషిత్వము ఉపచారముగా చెప్పినను అది వక్తృక్ష్వ లక్షణముగా నెరుంగవలెనే గాని, అసల్లక్షణము కాదని యరుంగవలయును. (1) అసల్లక్షణ ఋషి విజ్ఞానము. అసద్వా ఇదమగ్ర ఆసీత్ । కింత దసదాసీత్ ఇతి. ఋషయోవతే2గ్రే2సదాసీత్కేతే ఋషయ ఇతి. ప్రాణావాఋషయః" ఇతి – మరియును యజుర్మంత్రములకు ఋషి యని సంజ్ఞకలదు. రెండు భాగములైన బ్రహ్మకు యజుస్సు అని పేరు. ఒక యజస్సునకు యత్ అనియు, జూ, అనియు రెండు భాగములు. యత్ అనునది గతి ప్రకృతి గల అమృత బ్రహ్మ. జూ అనునది స్థితి ప్రకృతికమగు అమృత బ్రహ్మ. మొదటిది వాయువు. రెండవది ఆకాశము. అది బల ప్రాణము. ఇది విభువు. ఈ వాక్ప్రాణములను వాయువాకాశములు రెండును అన్యోన్యము అవినాభూతము. ఈ రెంటి సమష్టి రూపము యజుస్సు. అది ఋషి, దానిని వాఙ్మయ ప్రాణమనిగాని, ఆకాశమయ వాయువనిగాని ఎరుంగవలయును. బ్రహ్మ

సృష్టము జగత్తు. బ్రహ్మ దృష్టము విజ్ఞానము. బ్రహ్మ, లేక ఆత్మ బ్రాహ్మణుడు(ణము). ఈ మూడు బ్రహ్మల మొత్తము ఎచ్చట నుండి ఉపక్రమింపబడునో అది ఋషి. ఏ ధ్రువబ్రహ్మ యందు మొదటి ప్రవృత్తిక్రియ ఏది కలుగునో అది ఋషి. జగత్సృష్టికి గాని, విజ్ఞానదృష్టికి గాని, బ్రహ్మ గోత్రమునకు గాని, మొదటి ప్రవృత్తి స్థానము ఋషి, గోత్రమన, వంశ పరంపర యను గిరి. కనుక ఈ ఋషియు 1. సృష్టి ప్రవర్తకము, 2. వేద ప్రవర్తకము, 3. గోత్ర ప్రవర్తకము. అని మూడు విధములు అగును. అందు సృష్టి ప్రవర్తక ఋషులు మూడు వర్గములగుదురు. ఏకర్షులు, సప్తర్షులు, దశర్షులు, అని అసంగ స్వభావము వలన అన్యముతో కలియక ఉండువారు ఏకర్షులు. ఏడుగురు చొప్పున సహకారముతో హెచ్చుతగ్గులు లేక ఉండు వారు సప్తర్షులు. వారు అనేక విధములుగ సంసర్గము నొందుచుందురు. కాగా, నాలుగు విధములగుదురు. 1. అగ్ని విధులు, 2. సాకంజవిధులు, 3. గోవిధులు, 4. స్వసృ విధులు. 4. ఆత్మలు, 2 పక్షములు, పుచ్ఛమొకటి. ఈ క్రమము వీరు అగ్ని విధులు – "సాకం జానాం సప్తధమాహురేకజం షడిద్యమా ఋషయో దేవజా ఇతి । తేషా మిష్టాని విహితాని ధామశః స్థాత్రే రేజంతే వికృతా నిరూపశః" ఇది సాకంజ విధ క్రమము. సూర్య రశ్మి యందు సప్తవర్ణములూ ఏకీభవించినట్లుగా కూడునది గోవిధము. "సప్తస్వసారఃసువితాయసూర్యం వహంతి హరితోరథే" అనిఛందస్సుల వలె, కలియు విధము స్వసృవిధము. ఇక ఒకరో, ఇద్దరో, ముగ్గరో, పెక్కు మందియో, అందరునె కలియుచు, తొలగుచు, రూపాంతరముల నొందు చుండువారు దశర్షులు, వారు వైరాజులనియు అందురు –

మరియును పరమేష్ఠి యగు విష్ణువు యజ్ఞము. దానిం గూర్చి వచ్చిన ఋషి విరాట్టు అగును "దశాక్షరావైవిరాట్" "వైరాజోమనుః" ఆమనువు. ఈ దశఋషులను ఉద్భావన చేయును. ఆ పది మందియు ఇట్లుందురు – భృగ్వంగిరసులు, అత్రిమరీచులు, పులస్త్య పులహులు, క్రతుదక్షులు, వషిష్ట అగస్త్యులు. శునక, జమదగ్నులు, భృగుభేదములు. అధర్వ, దధ్యజ్+ కణ్వః, ఘోరః, అయాస్యః, గోతమః, వామదేవః, భరద్వాజః, ఉచచ్ఛ్యః, బృహస్పతిః, సంవర్తః అను నీ మొదలగు వారు ఇరవది యొక్క మంది అంగిరస్సులు. "అనంత విదావాఅంగిరసః, విరూపాసఇద్రుషయః । త ఇద్గంభీరవేపసః। తే అంగిరస స్సూనవః। తే అగ్నేః పరిజజ్ఞిరే।" అనియు కలదు. మరియు "ప్రాణావై వశిష్టఋషిః। మనోవై భరద్వాజ ఋషిః। ఇత్యాదులున్నూ కలవు. ఇంతకును అసత్తైన మూల భూత ప్రాణములు ఋషులని ఫలితార్థము.

(2) రోచనాలక్షణము ఋషి విజ్ఞానము –

ఋషి శబ్దము, రోచనాశీలములగు, అనగా, ప్రకాశ శీలములగు నక్షత్ర తారకాదుల యందును, ప్రయోగింపబడుచున్నది. "ఏకం, ద్వే, త్రీణి, చత్వారీతివా అన్యాని నక్షత్రాణి అథైతా ఏవ భూయిష్ఠాయత్కృత్తికాః ఋక్షాణాంహవా ఏతా అగ్నేపత్న్య ఆశుః సప్తర్షీన్హస్మవై పురర్క్షా త్యాచక్షతే అమిహ్యుత్తరాహి సప్త ఋషయః ఉద్యంతిపరఏతాః" ఇత్యాదిశ్రుతులు పెక్కులుగా గలవు. వీనిని బట్టి ధృవతారయందును. దానికి సమీపమందలి సప్త తారల యందును, ఇతర తారకల యందును. ఈ

ఋషి శబ్దము ఉపచారముగా కనబడుచున్నది. ఇతరములగు, మత్స్య, అగస్త్య, వశిష్ట, ఆపః। అపాంవత్స భృగు, అత్రి, అంగిర। మార్కండేయాదులు జ్యోతిర్విశేషములైన ఋషులుగా నక్షత్ర విద్య యందు చూడగలము. మరియు సూర్య రశ్మి ప్రతిష్ఠితములగు ప్రాణులన్నియు దేవతలు, చంద్రుని యందలి ప్రాణులన్నియు పితరులు, నక్షత్ర రూప ప్రకాశము లందలి ప్రాణములన్నియు ఋషులని యరుంగవలయును.

(3) ద్రష్టులక్షణ ఋషి విజ్ఞానము.

ప్రాణ, దేవ, భూత, భౌతిక, అర్థములకు నియతమగు కార్యకారణభావము, విద్య; అది నియతము, సత్యము, యథాతథము, అది బ్రహ్మ అది వేదము. ఒక విధముగ పరిగృహ్యమానధర్మముచే అభినీయ మాణంమగు నియతి బ్రహ్మయు, గృహీత పూర్వాహిత సంస్కారముచే అభినీయ మానమగుని నియతి విద్యయు, వాక్కుచే అభినీయమానమగు నియతి వేదమును అని నిర్ణయము. అయినను, పెద్దలు వీనిని వ్యవహరించుట యందు సాంకర్యము గనే వాడిరి. కనుకనే, త్రయోవేదాః। త్రయీవిద్యా, త్రయంబ్రహ్మ, అని వ్యవహారములు వెలశినవి. మరియు శబ్దములచే ఉపపాదితమైన దేవతావిజ్ఞానము వేదము. దేవతా విజ్ఞానము నుపపాదించు శబ్దము, మంత్రము, అని వేదమంత్ర శబ్దములకు వ్యవస్తితి ఉన్నను, సంజ్ఞకు, సజ్ఞికి, తాదాత్మ్య ఉపచారము వలన ఆ రెంటికి సంకీర్ణ వ్యవహారము కలుగుచున్నది. "ప్రత్యక్షేణాను మిత్యావాయస్తూపాయోనబుధ్యతే। ఏతం విందతి వేదే నతస్మా ద్వేదస్య వేదతా" అనుచో, శబ్దాభిప్రాయము చేతనే వేద శబ్దము ప్రయోగింపబడినది. "ఋషయో మంత్ర ద్రష్టారః సాక్షాత్కృతధర్మాణః ఋషయో బభూవుః తే సాక్షాత్కృత ధర్మస్య ఉపదేశేనమంత్రాన్ సంప్రాదుః" అనుచో విద్యాభిప్రాయము తోడనే మంత్ర శబ్దము ప్రయోగింపబడినది. లేదా, శబ్దము దాని యర్థము కలయగా మంత్ర శబ్దము వాడబడుచున్నది. దానిని బట్టియే దేవతా విజ్ఞానము, దేవతా రూపమును, సముదాయదృష్టితో శబ్దములు, అవయవమునందును వాడబడుటయును కలుగుచున్నది. యెట్లన, సీమాపరిచ్ఛిన్నమగు ప్రదేశమందున్న శాలా సముదాయమందలి జన సముదాయము నందు నిరూఢమైన గ్రామ శబ్దము ఆ ప్రదేశమందును, శాలయందును, సముదాయమందును, జన సముదాయము నందును వర్తించు చున్నది కదా. అట్లే దేశ విశేషము నందు ఆరూఢ మైన పాంచాల శబ్దము తదవయవమునందును, పూర్వపాంచారులు, ఉత్తరపాంచారులు, అని ప్రయోగింపబడుచున్నది గదా. అట్లే ఈ శబ్దముచే ఉపదిష్టమయిన విజ్ఞానము నందు నిరూఢమయిన మంత్ర శబ్దము శబ్దమునందును. విజ్ఞానమునందును ప్రయోగింపబడుచున్నది. మంత్ర సమానార్థము బ్రహ్మ శబ్దమును కలదు. కనుకనే దానికినీ రెండు భావములు చెప్పబడినది. "ద్వేబ్రహ్మణీ వేదితవ్యే శబ్దబ్రహ్మ పరంచయత్। శాబ్దేబ్రహ్మణి నిష్ణాతః పరంబ్రహ్మాధి గచ్ఛతి" అని శబ్దాత్మక బ్రహ్మయు వేద్యమే, విజ్ఞానాత్మక పరబ్రహ్మయు వేద్యమే ఇట్లు వాక్యమందును, విద్యయందును, బ్రహ్మ మంత్రము. అను శబ్దములు వాడబడుచున్నది.

ఇంకను ఈ ఋషులకు శబ్ద రచనా కర్తృత్వాభిప్రాయముచే మంత్రకర్తృత్వము దేవతా విజ్ఞాన సాక్షాత్కర్తృత్వాభిప్రాయముచే మంత్ర ద్రుష్టుత్వమున్ను అను నీ యుభములున్నూ సమంజసములగు చున్నవి. కనుకనే "యాంఋషయోమంత్రకృతః మనీషిణః అన్వైచ్ఛన్‌దేవాస్తపసా శ్రమేణ తాం దేవంవాచం హవిషాయజామహేసానో దదాతు సుకృతస్య లోకే" "నమోఋషిభ్యో మంత్రకృద్భ్యో మంత్ర పతిభ్యః" "మాసామృషయోమంత్రకృతోమంత్రవిదః ప్రాదురైవీంవాచం" ఇత్యాది శ్రుతులయందు, ఋషులకు మంత్ర కర్తృత్వము వినబడుచున్నది. "దేవా ఇహపరోవర్య విదః సుశ్రువాంశో2నూచానాఃతదీయాహీయం వాక్" అన్నది యుక్తమే. ఈ వాక్య రచన శరీరబుద్ధీంద్రియములచే నుపపాదింప దగినదే కాని, దాని యంత నది వెలయునది కాదు. కనుకనే అభియుక్తులు "బుద్ధిపూర్వా వాక్యకృతిర్వేదేబ్రాహ్మణేసంజ్ఞా కర్మసిద్ధిలింగం" అన్నారు.

కనుక, కృతకములు ఈ వేదమంత్రములు. ఇక విజ్ఞానాత్మకములు అతీంద్రియార్ధకములు నగు వేదములు. అనీశ్వరులగువారు ఉత్పాదింప జాలరు. అవి అతీంద్రియములు, ననాదులు, అపౌరుషేయములును గదా. సరియే, "అనాది నిధనానిత్యావాగుత్సృష్టా స్వయంభువా। ఆదౌ వేదమయీ దివ్యా యతస్సర్వాప్రవృత్తయః" ఇత్యాది స్మృతులు వలన వాగాత్మక వేదమునకే అకృతకత్వముపదేశింప బడుచున్నది గదా. అనుచో సత్యమే "యదివై ప్రజాపతేః పరమస్తి వాగేవతత్" అను వాజసనేయ శ్రుతి యందలి శ్రుత మయిన నిత్యమగు ఒకానొక వాక్కును లక్ష్యముగా పెట్టుకొని చెప్పబడినది. ఆ వాక్కు ఈ వాక్కే అని భ్రమించకూడదు. ఆ వాక్కు, సూర్యుడు త్రైలోక్యము, సర్వ లోకములు, నైన సర్వాత్మకమని, అందందు పెక్కు విధములుగా వినబడుచున్నది. "అథోవాగే వేదం సర్వం" అని వాక్కునకు సర్వాత్మకత్వము చెప్పబడినదిగదా. ఈ అభిప్రాయము చేతనే –

"తస్మాద్యజ్ఞాత్సర్వహుతః। ఋచస్సామాని జజ్ఞిరే। ఛందాంసి జజ్ఞిరే తస్మాత్। యజుస్తస్మాదజాయత" అని ఋగ్యజుస్సామములకు, అవి నిత్యములయిన వాక్కులయినను, ప్రజాపతి, నిశ్వాస రూపమున, నుద్భవించుట వలన యజ్ఞ ప్రభవత్వము చెప్పబడినది. ఈ మూడు వాగ్విధములే వేదము స్వయంభువు. ఈ వేదమును ఈశ్వరునిగనో, ఈశ్వర నిశ్వసితగనో, ఈశ్వర కృతముగనో యెంచిరి. తపః ప్రభావము వలన, సంశుద్ధాంతఃకరణముగల, ఆవిర్భూత ప్రకాశముగల, అతీంద్రియ దృష్టిగల వారి, హృదయమునందు, స్వయముగ ఆవిర్భవించునని, ఆనిత్య సిద్ధార్థమే ఆయా కాలము లందు గ్రహింపబడుచున్నది. శ్రుతియు. "తద్వాఋషయః ప్రతి బుబుధిరేయ ఉతర్హ్యాఋషయ ఆసుః" అనియు, "యేసముద్రాన్నిరఖనన్ దేవాః తీక్ష్ణాభిరభ్రిభిః సుదేవో అద్యత ద్విద్యాత్ యత్ర నిర్వపణం దధుః" ఇతి అనియును " మనస్సముద్రః వాక్తీక్ష్ణాభ్రిః త్రయీవిద్యా నిర్వపణం" అనియును "దేవా ఇహపరోవర్య విదః సుశ్రువాంశో నూచానాః" అనియును "అజాన్‌హవైపృశ్నీన్ తపస్యమానాం బ్రహ్మస్వయంభు అభ్యానర్షత్ తద్రుషీణాంఋషిత్వం" అనియు "యజ్ఞేనవాచః పదవీయమాయంస్తామన్వవిందన్ ఋషిషుప్రవిష్టాం॥ ఇతి అనియును చెప్పబడినది. స్మృతియును ''యుగాంతేంతర్హితాన్వే దాన్సేతిహాసాన్ మహర్షయః। లేభిరే తపసాపూర్వం

అనుజ్ఞాతాస్స్వయంభువా।" అనియెను. ఆప్తుడీ యర్థమును చూచినట్లు ఇతరులకు వాక్కుతో చెప్పునపుడు ఆ ద్రష్ట యొక్క వాక్యము శ్రుతియగును. దానికి ఇతర ప్రమాణములతో పనిలేదు. ఇక విన్న వాని వాక్యము స్మృతి యగును. అది స్వప్రమాణ్యము కొరకు శ్రుతి నపేక్షించును. కనుక పరతః ప్రమాణ మగును. ఏలయన, స్మృతి యందు వక్త అసాక్షాత్కృత ధర్మడు కనుక పరప్రత్యయాలంబనమున అర్థమును గ్రహించినాడుగదా । ఆవిధముగ సాక్షాత్కృత ధర్ముడు పరప్రత్యయము నపేక్షింపడు గనుక ద్రష్టవాక్యము స్వతః ప్రమాణమగును. గౌతమ సూత్రములకు వ్యాఖ్యానము చేయుచు, వాచ్యాయనుడు ఈ విషయమునే చెప్పెను – ఆ ద్రష్టయు లౌకికుడు, ఋషి అని రెండు విధములు. పెక్కు మంది శ్రోతలు చూచుటకు అనువైన యర్థమును, తాను చూచి చెప్పగలవాడు లౌకిక ఆప్తుడు. ఇతడు అతీంద్రియార్థమును చూడజాలడు. ఊహింపను జాలడు. ఇక అతీంద్రియ అసంవేద్య అతీతా నాగతముల యందు అవ్యాహత ప్రచారముగల తపః ప్రభావ జనిత దృష్టిని పొంది, ఆ ఆర్షచక్షువుతో సర్వమును యథాతథముగ అధిగమించువాడు ఋషి.

ద్రష్ట, ఆప్తుడు, అనూచానుడు. ఇవి సమానార్థకములు. అర్థమీక్షించి, అన్వేక్షించి, పరీక్షించి, సమీక్షించి, విశేషముల నరయువాడు ద్రష్ట. చక్షురాదీంద్రియ జన్యము. లింగ జన్యము. శబ్ద జన్యము. నగు జ్ఞానము పాష్టికము. నిర్వికల్పజ్ఞాన మవగమము । అధిగమము. ప్రత్యక్షము, ప్రమ, ఇది అర్థమునకు ఆప్తి. ఈ ఆప్తి గలవాడు ఆప్తుడు. అర్థమును చూచి యధాతథముగ అవగమించి. చూచినది చూచినట్లు అనువదించువాడు. అనుశాస్త. అనూచానుడు. ఈవిధముగ ఈ మువ్వురికి సమానాధికరణము కలదు. అయినను ద్రష్ట యొక్క దృశ్యము 1. భౌతికము 2. దైవికము. 3 అతీంద్రియము అని మూడు విధములు. అందు భౌతికార్థములందు. ద్రష్టలు, ఆప్తులు, అనూచానులు నగు వారి యందు ఋషి శబ్దము లేదు. దైవికములు, అతీంద్రియములు అగు అర్థములందు ద్రష్టలగు వారికి ఋషి శబ్దము వర్తించును. ఎట్లన, విషమయ ద్రవ్య విజ్ఞానమునందు, శునక, మార్జాలాదు లందు సామర్థ్యము కలదు. ముంగిస మొదలగు వానికి విషహార ఓషధి విజ్ఞానము కలదు. పురుషులెరుంగని భావ్యర్థమును, కుక్కలు, నక్కలు, వాయసములు మొదలగునవి సూచించును. తమ తమ రోగములను హరించు నోషధి విజ్ఞానము ఆరణ్యపశువులన్నిటికి కలదు. భావివృష్టి విజ్ఞానము. మండూకాదులకు గలదు. ఇట్లు ఈ అతీంద్రియ విజ్ఞాన జనక ప్రభావములు ఆయా ప్రాణి కులము నందు విచిత్రములు. నైసర్గికములుగా, కనబడుచున్నవి. ఇట్లే ఆ ఈ అపూర్వము. అతీంద్రియమునగు అర్థావగమము, తపః ప్రభావముచే మనుష్యులయందు కలుగునప్పుడు వారిని ఋషులందురు. ఇది మూడవ ప్రవృత్తి –

(4) వక్తృ లక్షణ విజ్ఞానము.

వాక్య సాపేక్షమయిన మాంత్రవర్ణిక ఋషిత్వము ఒకటి కలదు. అనగా ఏ వక్త ఏ మంత్రమును, లేక సూక్తమును చెప్పునో ఆ వాక్యాంశమును ఋషియే, ఆయా ప్రాణ విజ్ఞాన ద్రష్టలగు ఋషులే, ఆ విజ్ఞానమును శబ్దముల ద్వారా ఉపదేశించిరి. కనుక తరచుగ మంత్రద్రష్టయగు ఋషియే, మాంత్ర

వర్ణిక ఋషి నాబడును. కాని అచ్చట అచ్చట మంత్ర ద్రష్ట యగు ఋషి కంటే భిన్న ఋషియు, మంత్రాదులకు మాంత్రవర్ణిక ఋషిగ తోచును, ఏలయన ఆయామంత్రములు ఆయా ఋషులే చెప్పినట్లు చెప్పబడినది. ఎట్లన, ఆంభృణిసూక్తమునందు ఆంభృణీ ఋషి యొక్క పుత్రిక వాక్కు అను పేరుగల ఋషి, త్రైలోక్య వ్యాప్తమగు అనాదివాక్తత్వమును స్తుతించి యున్నది. అచట ఆంభృణపుత్రియగు వాగ్రుషిస్తోత్రము చేయబడుచున్న వాగ్రూప, దేవతతో, అభేద మగుట వలన ఆంభృణీ వాక్కునందు ఋషిత్వము లేదు. అయినను. మంత్ర ద్రష్టకు భిన్నముగ స్తోత్రముచేయబడు వాగ్దేవతనే ఋషిగ నెంచిరి. వాక్యము ఋషి, వాక్యముచే చెప్పబడునది దేవత యని పరిభాష. కనుక, వర్ణనీయమగు, వాగ్దేవత స్తుతి, తద్వారానే, ఇచట చేయబడినది. ఇంతకు.

వేదమునందు, దేవస్తవము, సంవాదము. ఆత్మస్తవము. అని మూడు రకముల మంత్రములు కలవు. భావవృత్తములకును దేవస్తవమునందే అంతర్భావమ. ఇందు దేవస్తుతి రూప మంత్రముల యందు స్తుతింపబడు దేవత వేరు, స్తుతించు ఋషి వేరు. ఇందలి ఋషియే ఆ మంత్రమునకు ఋషి యగుచున్నాడు. సంవాద మంత్రములందు ఇరువురు వ్యక్తులకు పరస్పర సంవాదము జరుగును. ఇందు ఒకటి ఋషి. ఒకటి దేవత, ఇట్టి చోటులందు మంత్ర ప్రణీతయే ఋషియని లేదు. అగస్త్యేంద్ర సంవాద సూక్తములో వారిరువురును ఋషులే. ఇరువురును దేవతలే. అగుచున్నారు. ఆత్మస్తవము నందు మంత్ర ప్రణీత, తన్నేస్తుతించును లేదా తత్ప్రదిపాద్య దేవతయే, తన్ముఖమున స్తుతించును. కనుక దేవతయు ఋషియు, నచటయొకటియే, పైన చెప్పిన ఆంభృణీసూక్తము ఈ కోటిలోనిదియే. ఆ ఈ విషయమంతయు బృహద్దేవత యందు విస్తరింపబడియున్నది. ఇతి ఋషి సామాన్యాధికారము.

## సృష్టి ప్రవర్తకాధికారము

కొందరిట్లుందురు. ప్రవర్తకత్వమన్నదొక్కటే కాని నాలుగు విధముల లేదు, ఏకార్థమునందు వృత్తి నానాత్వము అసవరము లేదని, కనుక ఋషులు. 1. సృష్టి ప్రవర్తకులు, 2. గోత్ర ప్రవర్తకులు, 3. వేద ప్రవర్తకులునని మూడు విధములే, అసల్లక్షణ, రోచనాలక్షణములకు, సృష్టి ప్రవర్తకము లందే అంతర్భావము. ద్రష్టలకు, వక్తలకు, వేద ప్రవర్తకుల యందే అంతర్భావము. ఆ సృష్టి ప్రవర్తకులు 1.దివ్య ఋషులు, 2. దేవ ఋషులు, 3. పురాణ ఋషులు అని చెప్పబడుదురు.

శరీరము వలె హిరణ్మయ మండల మన్నది ఒకటి కలదు గదా. అందొక పురుషుడు ఆత్మ, స్వతంత్ర తేజో ఘనుడు, పరదేవత యను పేరు గలవాడు. అతడే సంవత్సరము. వైశ్వానరుడు. హిరణ్య గర్భుడు, సర్వజ్ఞుడు. అతనిని గూర్చియే, “సహస్రశీర్‌షాపురుషః సహస్రాక్ష స్సహస్ర పాత్ । సభూమిం విశ్వతోవృత్వా అత్య తిష్ఠ ద్దశాంగులం” ఇత్యాది గను “హిరణ్య గర్భ స్సమవర్త తాగ్రే భూతస్య జాతః పతిరేక ఆసీత్” ఇత్యాదిగను. “తస్మాత్పరం నా పరమస్తి కించిత్” ఇత్యాధికముగను. శ్రుతి చెప్పి యున్నది. ఈ ముప్వురు దేవతలు ఒకే మూర్తి. అదే సంవత్సరము. అదే పరదేవత, దాని జాగృతియే విశ్వ ప్రపంచ

ప్రవృత్తి. దాని సుప్తియే ప్రళయావస్త. సుషుప్తియే మహాప్రళయావస్త. పునర్జాకృతి పున స్సృష్టి. ఇట్లు ఈ సనాతనుడు పరమేశ్వరుడు. విశ్వాత్మయు నగు భగవంతుడు. అనాద్యనంతుడు. అతనికి మృత్యువు లేదు. మృత్యువన్నది, శరీరమందలి తైజసు నకు పరదేవత యందు లయించుటయే. పరదేవతకు, యెందును లయము లేదు. కనుక అతనికి మృత్యువు లేదు. అతడు మనకు పరమాత్మ. అతనినో, అతని ఏక దేశమునో మన మారాధింతుము. అతని అంగ ప్రత్యంగభూతములు ఈ సర్వము నందున్నూ స్థావరజంగమములు. చేతనా చేతనము. అనశన సాశనములు. అమృత మర్త్యములు, మూర్తా మూర్తములు, సదసత్తులు. అతని కతిరిక్తముగ నేమియు లేదు.

అతని శరీర ప్రాణములు సృష్టి ప్రవర్తక పురాణ ఋషులు, మనుష్య శరీరము నందలి ప్రాణములు, భూత మాత్రలను, సర్వరసములను, భౌతిక ధాతువులను, తేజోమాత్రలను, సర్వ బలములను, సర్వ సంజ్ఞా చేష్టాకర్మములను, ప్రజ్ఞా మాత్రలను, ఇంద్రియములను, ఇంద్రియములకు చెందిన జ్ఞాన కర్మలను వెయ్యేల సర్వమును సృజించుచున్నవో అట్లే అతని శరీరమునందును, పితరులు దేవతలు, అసురులు, మొదలగు నవన్నియు. ప్రాణాయత్తములు, ప్రాణము నుండి పుట్టి అందే యుండి అందే లయించును. ప్రభవ ప్రతిష్ఠా పరాయణము ప్రాణము. ఇట్లే పురాణమునందును ప్రాణమే విధరణముగ నెరుంగ వలయును. “అయంవైప్రాణః యోయంపవతే. యోవైప్రాణః సఆయుః సోయమేక ఇహైవ పవతే సోయం పురుషే2న్తః ప్రతిష్ఠో దశధావిహితః” అని రాజసూయ శ్రుతియందు ఈ పదియే శరిరమునందలి ప్రాణములు ఒప్పుచున్నవి. పదియే ఆముష్మిక మందును, తైజసమగు మనస్సునుండి ఈ శరీర ప్రాణములున్ను, హైరణ్య గర్భ మనస్సు నుండి ఆముష్మిక ప్రాణములున్ను వెలయును. ఆయీ విషయము నంతయు మనుస్మృతి యందున్ను “ఆసీదిదం తమో భూతం అప్రజ్ఞాత మలక్షణం” ఇత్యాదిగావిస్తరింపబడియున్నది.

హిరణ్యగర్భుడన సూత్రాత్మ. ఇదే వాయువాత్మ. దాని నుండి విరాట్ వెలువడును. అది అన్నమయాత్మ. అన్నమేవిరాట్, దశాక్షరము విరాట్. కనుక ఈ దశప్రాణములు ఆ విరాట్టునకు అవయవ భూతములుగ ఉత్తరోత్తరములు అన్నింటికి అన్నభూతముగ వెలయుచున్నవి. 1. మరీచి, 2.భృగువు, 3.అంగిర, 4. అత్రి, 5. వశిష్ఠ, 6. అగస్త్య, 7. పులస్త్య, 8.పులః, 9. యజ్ఞః, 10. ప్రచేత, 11. కౌశిక, 12. నారద అను వారు దశ బ్రహ్మలుగా చెప్పబడిరి. వీరికి ఆధ్యాత్మికముగ కార్య లక్షణములు ఎట్లన మరీచి నుండి సంభూతి దాని వలననే అపత్యాది సంసార ధర్మ ప్రవృత్తి ప్రతిపత్తి. మరీచి సంయోగము లేనిచో సంభూతి విచ్ఛేదమే. అంగిరసు నుండి స్మృతి. అది లేని నాడు స్మరణముండదు. అత్రి నుండి అనసూయ । దోష దృష్టి అసూయ త దభావము అనసూయా. అసూయా వృత్తి ప్రవృత్తికి ప్రతి బంధక వృత్తి, భృగువు నుండి ఖ్యాతి. అది శ్రీ విశేషము. వశిష్టు నుండి ఊర్జస్సు. అది బల విశేషము. క్రతువు (యజ్ఞము) నుండి సన్నతి అనగా ఏ విషయము నందు గాని ఆసక్తి, విధేయత; పులస్త్యు నుండి ప్రీతి. అనగా అనురాగ విశేషము, పులహునకు క్షమ, ప్రచేతనకు దక్షత, ఉత్సాహవిశేషము వాగ్బుద్ధి శరీరారంభక ప్రయోజనం, నారదునకు శ్రద్ధానప్రతీయతాధర్మము నారములన ఆపస్సులు. అవి శ్రద్ధా శబ్ద వాచ్యములు.

ఆపస్సులే శ్రద్ధను గూర్చునవి. త న్నిరూధమున ప్రతికూలములై పూర్వమునకు విరుద్ధమగు శ్రద్ధను పుట్టించును. ఇదే నారద ప్రాణము. దీని ఆగమనము వలన కలహకారక విప్రతిపత్తి వచ్చును. ఇట్లు ఈ ప్రాణముల విశేష విషయ సంయోగ వియోగ తారతమ్యము లను బట్టి ధర్మములందు తారతమ్మము వెలయుచున్నది. వీని ఆధిదైవిక ఆధిభౌతికాధ్యాత్మికములను బట్టి పలు విధముల కార్య ధర్మములు, అరణ్యక ఉపనిషత్ పురాణములందు విశదీకరింపబడినవి.

ఇంక వీని నుండి ఇతరములగు సప్తప్రాణములు కలుగుచున్నవి. అవి సప్త ఋషులు. సప్త బ్రహ్మలు, సప్త ప్రజాపతులు, సప్త మనువులు అని వ్యవహరింపబడుచున్నవి. వాని కధ్యాత్మముగ, అధి దైవతముగ, అధిభూతముగ ప్రతి విషయమునను విలక్షణముగ బహు కార్యములు శ్రుతులందు కలవు. అవియును ఆయా ప్రకరణముల యందు పరిశీలింపదగినవి.

విరాట్టు, వ్యాకృతము, అవ్యాకృతము అని రెండు విధములు. హిరణ్యగర్భు నుండి యుత్పన్నమైనది మాత్రము అవ్యాకృత రూపము. అది మరల వికారము నొందగా వైరాజము। దానివే, ఈదశవ్యక్తులు అవయవములని కొందరు. ఈ సూక్ష్మ వికల్పము నంగీకరింపని వారు హిరణ్యగర్భు నుండి వెలశిన విరాట్టే ఈ పది వ్యక్తులూ నందురు. ఈ చర్చ యందు అంతగా విశేషములేదు. కేంద్రము (నాభి) నుండి ఈ దశ ప్రాణములు ప్రాదుర్భూతములై ప్రవర్తించును. ఆ కేంద్రము సర్వ ప్రాణాధారమగు నభ్యప్రాణము. అదియే అహంశబ్దముగా వాడబడుచున్నది. అదియే ప్రత్యగ్బ్రహ్మ. అదియే ఇంద్రుడు. ఇది సృష్టి ప్రవర్తకాధికారము.

# వేద ప్రవర్తకాధికారమునందు

# వేద ఋషి రహస్యము

వేదాచార్యులు ఋషులు. వేదము, విద్య, బ్రహ్మ యీ మూడును ఏకార్థకములు. బ్రహ్మ యొక్క విద్య వేదము. బ్రహ్మ తన్ను యజ్ఞముగా చేసుకొని ఆ రూపముచే ఈ సర్వమునైనది. అగుచున్నది. కానున్నది. భవద్భూత భవిష్యము లన్నియు అగు, నిది యజ్ఞమే. ఆ ఈ యజ్ఞ విజ్ఞానము వేదము. సర్వ వేదములును యజ్ఞ శరీరమునందు నిహితములు. ఆ యజ్ఞ విజ్ఞానము వలన ఈ సర్వ దేవతములు విజ్ఞాతము లగును. కనుక, దైవత విజ్ఞానము వేదము. దేవతలందరిలో ప్రధానుడు ప్రజాపతి. యజ్ఞమునకు అతడే ప్రభవ, ప్రతిష్ఠా, పరాయణం। ప్రజాపత్యవినాభూతమగు యజ్ఞమును ప్రజాపతియే. కనుక ఈ ప్రజాపతి విద్య వేదము ప్రజాపతులు అనంతులు. యజ్ఞము లనంతములు. వాని అన్నింటను ప్రధానుడు, అన్నింటికి ఆత్మ, సూర్య భగవానుడు. కనుక సూర్య విజ్ఞానము వేదము. యధాతథముగ సూర్య విజ్ఞానము వలన సర్వ దేవతలు, సర్వ యజ్ఞములు. సర్వ ప్రజాపతులు. విజ్ఞాతములగును. అపుడు సర్వాత్మనాబ్రహ్మ, విజ్ఞాతమగును. సర్వ ధర్మములును ప్రతిభాసిల్లును. ఈవిధముగ సూర్య వేదమగును. దైవతవేదము,

ధర్మ వేదము. యజ్ఞవేదము, ప్రజాపతి వేదము, బ్రహ్మ వేదము నగును. లేదా సామాన్యముగ సర్వ వేద మగును. కనుక సామాన్యముగ వేద శబ్దము ప్రయోగింపబడుచున్నది. ఆయుర్వేదము, పశువేదము, వృక్షవేదము, మొదలగు వాని వలె ఈ వేదము దేనిచేతను విశేషించ బడదు. ఇట పూర్వము ఆయా అర్థము చూచి చూచి విజ్ఞానముపదేశించిన వారు వేదాచార్య ఋషులందురు. వారు తొమ్మిది విధములుగ – మత్స్య వశిష్ఠా గస్త్యులు, భృగ్వంగిరో2త్రులు, కశ్యపకౌశికులు, విప్రకీర్ణులు అని చెప్పబడుదురు.

# మత్స్య వశిష్ఠాగస్త్యులు

వీరు ద్వివిధులు. 1. ప్రాణ విశేషములు, 2. తద్విద్వాంసులు. ఇందు ప్రాణములందే ఈ శబ్దములు ముఖ్యములు. వాని నెరింగి ఆ విద్యా సంయోగము వలన, భక్తిచొప్పున ఈ శబ్దములు అన్యత్ర కూడా ప్రయోగింపబడును. కనుక ప్రాణములుగనే వీని రహస్యలను వ్యాఖ్యానించెదము. అందును కుంభోత్పన్నులగుట వలన ఈ ముగ్గురు ఋషులు, మాన్యులందురు. కుంభ మనగా ఇక్కడ మానము, వీరు మైత్రావరుణులని చెప్పబడుదురు. మిత్రావరుణుల వలన ఊర్వసి యందు ఉత్పాదితులయినారు గదా. పగలు మిత్రము, రాత్రియే వరుణుడు. ప్రాతరాది సంధ్యాంత కాలమహస్సు. దీనిచే పూర్వ కపాలము సూచించబడుచున్నది. తదుపలక్షిత ప్రాణము మిత్రుడు. శ్రుతియు "మిత్రః సంసృజ్య పృధివీంభూమించ జ్యోతిషాసః॥ అనుచున్నది. ఇక సంధ్యాది ప్రత్యుషాంత కాలము రాత్రి; దానిచే పశ్చిమ కపాలము సూచించబడుచున్నది. తదుపలక్షిత ప్రాణము వరుణుడు. శ్రుతి "వియోజఘానశమితేవశర్మో పతస్తిరేపృథివీంసూర్యాయ" అనుచున్నది. ఈ కపాల ద్వయములను కూర్చు యామ్యోత్తర రేఖాత్మికయగు దిక్కు ఊర్వసి, పంచచూడ బ్రాహ్మణమున. మాహిత్థుడు ఈ దిక్కుని అప్సరత్వమున, నిదానించినాడు. యాజ్ఞవల్క్యుడును "ఆహుతిర్వసీ" అని నిదానమును చెప్పెను. కపాల ద్వయ యోగాత్మక మగునీ అండాత్మకమగు మానము కుంభము. ఆపోమయమగు దీని యంతరిక్షము, సముద్రము; సముద్రమున విహరించు ఊర్వసీ దిక్కున హెూమము చేసి లేదా యోగమును గూర్చుట వలన మిత్రావరుణుల నుండి ఆగ్నేయ ఆప్యవీర్య ప్రక్షేపము వలన ఈ కుంభమునందు 1. సీతవీర్యములు, 2. ఉష్ణవీర్యములు, 3. అనుష్ణ సీతవీర్యములు అను మూడు ప్రాణములు ప్రత్యుత్పన్నములగును. మొదటివి సోమ ధర్మములు. సౌమ్యములు, ఉత్తరాయతనములు అనబడును. అవి వశిష్ఠములు – ఆప, అప్స, వశిష్ఠ, ఇవి ఏకార్థములు. ఈ ఆపస్సలు వర్షమును కలిగించును. మృత్తునకు, ఆపస్సునకు సంయోగము కలిగించును. ఇవియే ఆపోమృదాత్మక పరిణామములను జనింపచేయును. ఇక రెండవ అగ్ని ధర్మములు, తీవ్రములు, దక్షిణాయతనములు. వీనికి అగస్త్యములు, ఆగస్తులు అని పేరు. ఇవి ఆపస్సును త్రాగును. మృదాపో విభాగమును కలిగించును. మృత్తును రసాత్మకముగ పరిణమింప జేయును. పిమ్మటి మూడవ ప్రాణములు, ఉగ్రములు, మధ్యాకాశాయతనము. మత్స్యములను పేరుగలదు. యమ ప్రాధాన్యమును బట్టి యామ్య మత్స్యము లందురు. జ్యోతిర్వేత్తల సంకేతమును బట్టి వీనిని, నియత బింబములుగల మూడు తారకులుగ నెన్నుదురు. ఇట్లు దివ్య ప్రాణములన్నియు, మాత్స్యములు, వశిష్ఠములు, అగస్త్యములు, అని మూడు

విధములు. ఈ మూటి వలనను సర్వజగత్తును పరివ్యాప్తమై యున్నది. ఈ ముర్వురును, మరుత్తు లనియు అందరు. ఇందు మత్స్యము, ఆపః ప్రవర్ధకము, శోధకము, తద్దోష నివర్తకమును అగును. అగస్త్యము అల్ప ప్రచారము గలది. ఇతనిని గూర్చి ఒక మంత్రము మాత్రమే అగపడును, ఆపస్సు నుండి పృథివి కలుగును. ఆ పస్సునుండి పృథివి అగులోపల ఎనిమిది వ్యాహృతులు కలుగును. ఆప, ఫేన, మృత్, శికత, శర్కర, ఆశ, అయః, హిరణ్యం ఇతి, ఇందు మొదటిది. పృథివీ వ్యాహృతి ద్రవరూపత్వము వలన ఆపశ్శబ్దము చేతనే వ్యపదేశింప బడును. కాని ఇది పృథివీత్వము నొందని ఆపస్సుల కంటే భిన్నమని యరుంగవలయును. దాని నుండియే మరుత్ప్రాణ సంయోగము వలన ఆ ఆప, ఫేన, మృత్, శికతలను, నాలుగు వ్యాహృతులు క్రమముగ కలుగుచున్నవి. అవియే వశిష్ఠ ప్రాణములు. ఇక వానికి మరల మరుత్సం యోగము వలన, శర్కర, అశ్మ, అయో, హిరణ్యము లను నాలుగు వ్యాహృతులు కలుగుటన్నది అగస్త్య ప్రాణముల పని, "అగంస్త్యాయతి, ఇతి" పర్వతమును వృద్ధి నొందించువాడు అణగత్రొక్కువాడు అని అర్థము, ప్రస్తరములగు శర్కరాదులు సంహతావయవములుగ నగుపడుచున్నవి. ఇంకను ఆ ఈ ఋషుల పెక్కు వ్రతములు మరొకచో విస్తరముగ జూడగలరు.

# భృగు, అంగిర, అత్రి

వీనిని గూర్చి ఆధిదైవికముగ వ్యాఖ్యానింతుము. నక్షత్ర విద్యయను ఒక విద్య కలదు కదా. అది జ్యోతి శ్చక్రము, పురాణాఖ్యాము నని రెండు విధములు. మొదటి దాని యందు రోచన బింబములను అధికరించి వాని ఉత్తరాధర దూరత్వగత్యుదయాస్తమనాదులగు ధర్మములు, నిర్దేశింపబడుచున్నవి. రెండవ దానియందు చక్కగా తెలియుట కొరకు విషువదాది ఛందములు, జ్యోతి రూప రథములు. వానికి తగిన నాగములు, కల్పించి, ఆయా ఆకాశ ప్రదేశమునందు అగపడు కొన్ని రాశులను అనేకములను కల్పించి వానిని దేవతలుగా నధ్యవసించి ఆ దేవ సత్యముల అనుచరిత ఆఖ్యానములను కల్పితములు గనే చెప్పుచు ఆయా ప్రయోజనములను కూడా ఆయా కల్పనల యందు చూపుచు, మృదుబుద్ధులైన వారికి సాధన ప్రవృత్తికి ఋచి, ప్రోత్సాహము, కల్పింప బడుచున్నది. ఇందుపదేశింపబడిన ధర్మార్థములు పెక్కులు గ్రహింప బడుచున్నవి. వానిని వేరు వేరు పరచి సంగ్రహముగ నెరింగినను, వాని ఆనంత్యము సర్వ సంగ్రహముగ సంభావింప బడుచున్నది. అన్ని జ్యోతిస్సులశక్తి గుణ విజ్ఞానము. నిదానవిద్యచే దైవిక భౌతికాద్యర్థ విజ్ఞాసంగ్రహణము కలుగుచున్నది. అందు రోహిణీలుబ్ధ కాఖ్యానము ఐతరేయశ్రుతియందు వినబడుచున్నది.

ఒకప్పుడు ప్రజాపతి మృగ రూపమును ధరించి తన కూతువెంట తగిలెను. దేవతలు ఈ అనుచిత కార్యమునకు అతనిని దండించువాని కొరకు వెతకి తమ శరీరముల నుండి ఘోరతమ భాగమును ప్రోగుచేసి ఒక దేవతను సృష్టించి ప్రజాపతి యొక్క అనుచిత కార్యమును చెప్పి అతనిని దండించుమని కోరుటయు. అతడు ఇందుకు నాకు ప్రత్యుపకారముగ పశుస్వామి యగు వరమిమ్మని దేవతలను కోరగా

వారట్లు ఇచ్చిరి. ఆ దేవత ప్రజాపతి శిరస్సును ఖండించెను. మృగరూప ప్రజాపతి శిరచ్ఛేదము చేయుట వలన ఆ దేవతకు మృగవ్యాధ నక్షత్రమని పేరుగలిగెను. ఇదే రోహిణి, త్రికాండబాణము, త్రికాండ తారయందురు, ప్రజాపతి తెగిన పిదప అతని వీర్యము "మాదుషత్" (దూషితము కాకూడదు) అని దేవతలన్నారు. పరోక్షభాషలో వారన్న "మాదుషత్" అను శబ్దమే మానుష మనబడినది. దేవతలు పరోక్ష ప్రియులుగదా. ప్రజాపతి రేతస్సనబడు శిరస్సు వైశ్వానరాగ్ని ద్వారా వేల్చబడగా దాని నుండి, ఆదిత్యుడు, భృగువు, బృహస్పతి, పశ్వాదులు ఉత్పత్తి అయినవి.

ఈ ఆఖ్యానమందు ప్రజాపతి తన కూతురితో అనుచిత కార్యమునకు తలబడినపుడు దేవతలు అప్రసన్నులై రుద్రుని ద్వారా ప్రజాపతిని శిరచ్ఛేదము చేయించుట నిరూపింప బడినది. ప్రజాపతి కూతురెవరు అను దాని యందు మత భేదమున్నది. కొందరు ద్యులోకమందురు కొందరు ఉషస్సందురు. మొదటిది ఆఖ్యానికుల మతము రెండవది వైజ్ఞానికుల మతము, ఇందు మొదటి మతమును బట్టి పరిశీలింతము. కృతిక నక్షత్రమునకు తూర్పున, లుబ్ధకబంధు నక్షత్రమునకు పశ్చిమమున, చంద్రునకుత్తరమున, ప్రజాపతి తారయు, పునర్వసు నక్షత్రమునకు దక్షిణ ప్రదేశమునందున్న ద్యుప్రదేశము ఇచ్చట ద్యులోకముగా గ్రహింపబడినది. ఆ ప్రదేశమందలి తారా విజ్ఞానమును ఈ ఆఖ్యానము నిరూపించును. కృత్తికకు తూర్పున ఎర్రని కాంతిగల రోహిణీ నక్షత్రమున్నది. దీనినే భృగువు నుండి వెలశిన లక్ష్మి యందురు. ఈ రోహిణి కెదురుగ దక్షిణమున ఆరు నక్షత్రముల దూరమున రక్త వర్ణముగలదే జ్యేష్ఠయను తారగలదు. ఆఖ్యానముల ద్వారా విజ్ఞాన నిరూపణ చేయు విద్వాంసులు దీనిని దరిద్రా అని పిలుతురు. జ్యేష్ఠానక్షత్ర సగభాగము నుండి, రోహిణి వరకు చంద్రుని ఆరోహణ జరుగును. ఉన్నతినందు వస్తువునకు లక్ష్మితోడను అవతని నొందు దానికి దరిద్రత తోను సంబంధము కాని ఈ రెండు నక్షత్రములును యర్రనివే, కనుక ఈ రెంటిని రోహిణియే అందురు. వీని మధ్య ప్రదేశము రోహితజాతి మృగము వలె నుండు ననుట వలన రెంటిని రోహిణి అనియు నందురు.

ఈ రోహిణీ నక్షత్రమునకు తండ్రియగు ప్రజాపతి బ్రహ్మ హృదయ నక్షత్రం. అది ఈశాన్య కోణమున నున్నది. కృత్తిక దీనికి మస్తకము. కృత్తిక యందు ఏడు నక్షత్రములు. ఈ ఏడును శీషమునందలి ఏడు ప్రాణములకు ఉపలక్షణములు కనుకనే శ్రుతియు "ప్రజాపతేర్వా ఏతచ్ఛిరః। యత్కృత్తికాః। అగ్నిరాస్యం। సప్తకృత్తికాః॥ సప్తశీర్షణ్యాః ప్రాణాః" అని చెప్పెను. ఈ బ్రహ్మ హృదయతార యందున్న ద్యుప్రదేశము రోహిణీ తండ్రిగ కల్పింపబడినది. వ్యభిచారమునకు రోహిణి వెంటబడు బ్రహ్మహృదయ రూప ప్రజాపతి కార్యమునకు రోతపడిన రోచనా దేవతలు అన్ని తారల తేజమునుండి ఉగ్రవీర్య మహాఘోర మృగవ్యాధ నామక రుద్రునుత్పన్నము గావించి తద్వారా ప్రజాపతి శిరము నరికించిరి. ఆ శిరస్సే మృగశిరా నక్షత్రము. అది దక్షిణమున బాణయుక్తుని వలె గనుబడును. ఛిన్నశీర్ష ప్రజాపతి ఉత్తరమున గనబడును. రోహిణీ నక్షత్ర బాణ మధ్యమున క్షరిత మయిన ప్రజాపతి వీర్యము నుండి ఒక మానుష శిరస్సు ఏర్పడినది. దాని అర్ధభాగము విషవనుకు దక్షిణమునను అర్ధ భాగము ఉత్తరమునను ఉన్నవి. అందు ఉత్తర భాగమునంటి

ఒక అగ్ని తారగలదు. దాని సంయోగమున ప్రజాపతి క్షరిత శుక్రమందలి ఒక బిందువు ప్రకాశమానముగను రెండవది అప్రకాశ మానము గను ఉండును. ఈ రెండును పునర్వసుకు జెందిన రెండు నక్షత్రములు. ఇందు పడమటి వైపుది ఆదిత్యుడందురు. తూర్పు వైపుది భృగువందురు భృగువు ఋషి ప్రాణము. రూప రహితము కనుక ప్రత్యక్షయోగ్యము కాదు. కాగా దాని ప్రత్యక్షత్వము కొరకు దాని యందొక విజాతీయ ప్రాణ సంబంధము నంగీకరించ వలయును. మరియు ఇట నీ ప్రాణము, వరుణ రూప ఆసుర ప్రాణము కనుక భృగువును వారుణి యనిరి. ఈ రెండు నక్షత్రములయెదుట లబ్ధకబంధు నక్షత్రము వరకు వంకర కర్రవలె మూడు నక్షత్రములు కలవు. ఇవి ఆదిత్యులని పిలువబడును. వీని కంటే భిన్నములై అతిసూక్ష్మ దృశ్యాదృశ్యములగు తారలన్నియు అంగిరసులు అందరు. వాని యందు ప్రదీప్తమగు లుబ్ధకబంధు తారను బృహస్పతి యందురు. మృగవ్యాధ రోహిణుల మధ్య ప్రజాపతి రేతమున వెలసిన అనేక జాతుల అనేక వర్ణముల పశువు లగపడును. దీనికి మొదట స్వామి ప్రజాపతి. శిరచ్ఛేదమునకు పిదప రోచనా రూప దేవతల వరదానమును బట్టి మృగవ్యాధుడు, వీనికి స్వామి అయ్యెను. ఇట్లు ఈ ఆఖ్యానము ద్వారా ఆ ప్రదేశమందలి తారల నామ స్వభావములు సులభముగ పరిచితము లగుచున్నవి. ఈ ఆఖ్యానమునకు వైజ్ఞానిక రహస్యమును కలదు. నిదాన విద్యను బట్టి అది మూడగును.

పంద్రెండుగురు ఆదిత్యుల యందు ఒకడు. ద్యోనామక ప్రజాపతియు కలడు. "ద్యౌఃపితాజనితా" "దౌఃపితఃపృథివీమాతః" అని శ్రుతి చెప్పును. ఈ ప్రజాపతికి ఉషయన్నది కూతురు. శ్రుతియు. "ఏషదివోదుహితా ప్రత్యదశి ˜వ్యుచ్ఛంతీయువతి శ్శుక్రవాసాః" అని పెక్కు విధములుగ శ్రుతివాకొన్నది. ఈ ఉషారూప దుహితను సంవత్సర ప్రజాపతి వెంటనంటుట ప్రకృతి సిద్ధము. సంవత్సర రూప సూర్యుని ఉదయము. ఉషకు పిమ్మటనే కదా. "సూర్యోదేవీ ముష సంరోచమానాం। మర్యోనయోషా మభ్యేతి పశ్చాత్" అని శృతియు చెప్పుచున్నది. ఈ సంవత్సరాత్మక సూర్య ప్రజాపతి ఉషస్సు నందు వైశ్వానరాగ్ని రూప రేతస్సేకము చేయుచున్నాడు. ఇందు వలన ఒక సంవత్సరములో కుమారాగ్ని కలుగుచున్నది. కుమారాగ్ని సంవత్సర ప్రజాపతి పుత్రుడు. ఈ అగ్నికి, అగ్ని, జల, ఓషధి, వాయు, విద్యుత్, పర్జన్య, చంద్రమ, ఆదిత్య అని యెనిమిది మూర్తులు, ఈ అష్టమూర్తులకు, క్రమముగ రుద్ర, శర్వ, పశుపతి, ఉగ్ర, అశని, భవ, మహాదేవ, ఈశాన, అని పేర్లు. వాజసనేయశ్రుతి యందుకలవు. ఈ ఎనిమిది అగ్ని యొక్క రూపములు. ఈ ఎనిమిదిన్ని చిత్రాగ్ని యందురు. కుమారాగ్ని తొమ్మిదవది. "తాన్యేతానిఅష్టావగ్ని రూపాణి, కుమారోనవమః" అనిశత పథము చెప్పుచున్నది. బాణముచే తెగిన సూర్యప్రజాపతి శిరస్సు వైజ్ఞానిక పరిభాషానుసారము. ఆ తపము, ప్రజాజాతి యొక్క ఈ ప్రవృక్త భాగము ప్రవర్గ్యము లేక మహావీరుడు అందరు. ఈ ఆదిత్య ప్రజాపతి యొక్క క్షరితమైన శిరోభాగము సంమ్రాట్. ఈ తపించునదే ధర్మము. అదే సత్య రూపము. జ్యోతి రూపము. సంవత్సరాత్మక సూర్య ప్రజాపతి యొక్క ఛిన్న భాగమిది. ఈ ప్రజాపతి యొక్క క్షరిత రేతోభాగము నుండి మనుష్య భూత పశ్వాది ప్రాణులుత్పన్నములైనవి. ఇందు మనస్సంపన్న జ్ఞాన శక్తి ప్రధానులు మనుష్యు లందురు. అశ్మలోష్ఠాది అసంజ్ఞ ప్రాణులు దూర్వ వృక్షాది అంతస్సంజ్ఞ ప్రాణులు సరీసృపాది స సంజ్ఞ ప్రాణులు, ఇంకను దృశ్యాదృశ్యములన్నియు ఆ ప్రజాపతి

రేతోభాగములే, ఈ ప్రాణులు పశువులు లేక భూతములు అనబడును. వీనికా కుమార ప్రజాపతి లేక మహావీరుడు స్వామి. కనుక అతనిని భూతపతి, పశుపతి, అందురు. ఇన్ని ప్రాణుల ఉత్పత్తికి కారణమైన ఆ ప్రజాపతి రేతో రూపరసము వైశ్వానరాగ్నిం బట్టి ప్రజ్వలితమగును. అందలి అర్చి భాగము భృగువు అంగార భాగము అంగిర యగును.

ఈ విధముగనే వాణీ రూప దుహిత యందు సిక్త మగు ప్రజాపతి యొక్క రేతస్సునుండి భృగ్వాదుల ఉత్పత్తి ప్రకారము కూడ సంక్షేపముగ చూతము –

సర్వలోకవ్యాప్తము, సూక్ష్మము, సముద్రము వలె పృథివికి నలుగడల నావరించినదియు, నిరాకారమునగు నొక ఆపోమయతత్వముకలదు. దానిని సరస్వాన్ అందురు. దానినే కొందరు ఇంద్రుడనియు, కొందరు వరుణుడనియు అందరు. సృష్టి కాది యందు "తమ ఆసీత్" ఆసీదీదం తమోభూతం" ఇత్యాది శృతిస్మృతుల వలన తమోభూతమగు నీ విశ్వమునందు స్వయంభువు అను అగ్ని ఒకటి వెలయును. దానిచే ప్రచ్యావితమగు విశ్వము ఆపోమయమగును. ఇట్లు ఈ విశ్వమందు అగ్ని జలములను రెండు తత్వముల వ్యాప్తియే యుండును. ఇవియే పైన చెప్పబడిన ఇంద్ర వరుణ తత్వములు. శృతియు, "సర్వమగ్నిమయంజగత్" "సర్వమాపోమయంజగత్" అన్నది. ఈ రెండును అంతటను సమాన రూపములుగ వ్యాపకములు. ఇందు ఏ తత్వము నందు ఆఘాతము కలిగినను నలుగడల తరంగములు లేచును. ఆపోమయ సముద్రమునందు అనగా సరస్వాన్నామక సముద్రము నందు లేచు తరంగ ధారకు సరస్వతి అని పేరు. ఆ సరస్వతి శ్రోత్రేంద్రియమునకు గ్రాహ్యమగు సరస్వతి వాక్కు కనుకనే అది అపౌరుషేయము – నిరాకారము, సర్వవ్యాపకము, విశ్వకారణము. "వాగేవేదంసర్వం" అని శ్రుతి అన్నది. ఇదే అపౌరుషేయ వేదమయీ వాక్కు. దీని యందు తూర్పునందు సంవత్సరాగ్ని రసమును, పశ్చిమునుండి వరుణుని రసమును వచ్చి కలియుచున్నది. ఈ రసము నందలి వైశ్వానరాగ్ని యోగమున జ్వాల కలుగుచున్నది. అది అంగిర, అందలి వరుణభాగము భృగువు. సరస్వతీ భాగము అత్రి. ఈ మూడింటిని దర్శించిన వారలా యాపేరులం బిలువబడుదురు.

## కశ్యపుడు

సూర్యకిరణముల సంఘర్ష చేతను పుట్టిన సూర్య కిరణస్థ జలము పేరు మరీచి ప్రాణము. దానిని కనుగొన్న ఋషిని మరీచి అనియే యందురు. ఆ మరీచి పుత్రుడగు కూర్మనామక ఆదిత్య ప్రాణమును సాక్షాత్కరించు కొన్నవాడు. ఆదిత్యుడు ఏ రూపముచే అవచ్ఛిన్నుడై రూప సృష్టి గావించెనో తద్రూపావచ్ఛిన్న ఆదిత్య ప్రాణ సమూహమును కూర్మమందురు. ఈ కూర్మ రూపాదిత్య ప్రాణము కశ్యప (కచ్ఛప) సమానకారము గలది కనుక ఆకారసామ్యమున దానిని కశ్యపుడనియు అందురు. ఈ కశ్యపాకృతిగల కూర్మ ప్రాణము పృథివి అంతరిక్ష ద్యులోకముల రసములగు, దధి, ఘృత, మధువులతో కూడి ఈ సర్వపిండములను ఉత్పత్తి గావించును. ఒక మైదానమున నిలబడి నలువంకల చూచినప్పుడు నీల

వర్ణాకాశము పృథివిపైన నలువంకలా బోర్లించినట్లగుపడును. దానిని ఊర్ధ్వ కపాలమందురు. అపుడు పృథివి అధః కపాల మగుచున్నది. ఈ ద్యావాపృథువులకు అంతర్వర్తియగు అంతరిక్షముతో ఈ మూడును ఈ దృశ్య ప్రపంచమునకు ఆవపనములు. వీనిచే అవచ్ఛిన్నమగు ప్రాణ ఘనమునే కూర్మమందురు. కనుక కూర్మ ప్రాణమును ద్యావాపృథివ్య మనియు అందురు.

ఇంకొక విధముగ ముఖ్యార్థమును బట్టియు ఈ ప్రాణము సర్వదృశ్య ప్రపంచమునకు ద్రష్ట. ద్రష్టను పశ్యకుడందురు. ఇదియే పరోక్ష భాషలో కశ్యప అనబడును. ఈ ప్రాణము. అచేతనమగుట వలన ద్రష్టృత్వము లేకున్నను ద్రష్టా దృశ్యమండలముల పరస్పర సామమండల సంబంధము చేతనే కలుగును. కనుక ఈ సిద్ధాంతమును బట్టి కశ్యప ప్రాణమునకే ద్రష్టృత్వము చెప్పబడినది. కనుకనే శ్రుతియందు “అచ్ఛిన్న పత్రాః ప్రజాః అను వీక్షస్వ” అనియు “దేవోయాతిభువనానిపశ్యన్” అనుచోటుల నిత్య సంబంధ మాత్రమే ద్రష్టృత్వమునకు కారణమైనట్లు కూర్మ ప్రాణముతో మనకు నిత్య సంబంధముండుట వలన దానిని ద్రష్టృత్వము ఉపపన్నమగుచున్నది. కచ్ఛపమునకు వలె కశ్యప ప్రాణమున్ను, ద్యావాపృధువుల యందలి సూర్య కిరణ సంఘర్షోత్పన్న మరీచి జలముచే కూడి యుండును. ఇది మరీచి జల, పృథివి అంతరిక్ష ద్యౌ, వీని దధి, ఘృత, మధు, రసయుక్తమై యుండును. దృశ్య సృష్టి యంతయు ఈ రసత్రయ మయ ప్రాణమున వెలయుట వలన ఈ మూటి కార్యములను మనము అరయగలము. ఎట్లన, మన శరీరమందలి కాఠిన్యభాగము, దధి వలనను, ద్రవ భాగము, ఘృతము వలనను, వాయు మయ భాగము విరళమగు మధురసము వలనను, నిర్మితము లగును. కనుకనే “సర్వాఃప్రజాఃకాశ్యప్యః” అని చెప్పబడెను. ప్రజలందరి సృష్టికి ఇది కారణము కనుక ఇది కూర్మము. “యదకరోత్, తత్కూర్మః” అని శ్రుతి చెప్పినది. యీ ప్రాణ సంబంధము అదితి తోనున్నది. కనుక ప్రసంగవశమున అదితి స్వరూపము కూడ కొంచము తెలుసుకొనుట మంచిది.

## అదితి నిరూపణము

వేదమునందు ఇది నాలుగు విధములు గలదు. 1. సూర్య మూలా, 2. దృష్టి మూలా, 3. నక్షత్ర మూలా, 4. ఆకాశ మూలా ఇందు –

1. సూర్యుని యెదురుగ నుండి పృథివీ భాగము అదితి. తద్విరుద్ధ పృథివీభాగము దితి. సూర్యుని యెదురుగ సూర్య ప్రకాశమునకు వచ్చు పృథివీస్థ జలము అదితి సంపర్కము వలన ఆదిత్యులనియు, ఇట్లే తద్విపరీతజలము దైత్యులనియు చెప్పబడును. మరియు సూర్య సంముఖము నుండి ద్యులోకము మొదలు పృథివి వరకు ఉన్న సర్వ పదార్థములు అదితియే. కనుకనే శ్రుతి “అదితిర్ద్యౌ॑రదితిరంతరిక్షం అదితిర్మాతా స పితా స పుత్రః విశ్వేదేవా అదితిః పంచజనః అదితిర్జాతం అదితిర్జనిత్వం” అన్నది.

(2) దృష్టి మూలా – సమతలముననిలబడి చూచునప్పుడు భూమండల ఉపలక్షిత అర్థాండకపాలము అరయగలము. అది అదితి. అదృశ్య భాగముదితి. పృథివీ పరిభ్రమణము వలన ఈ దృశ్యమారుచుండును. కనక క్రమముగ అండకపాలమంతయు దృశ్యమగుచుండును. కనుక అంతయు అదితియే, అనవలయును. పై మంత్రము ఈ అర్థమునే చెప్పును. మరొక విధముగనైనచో "అష్టౌపుత్రాసో అదితిర్యేజాతాస్తన్వస్పరి" ఇత్యాది మంత్రముల యర్థము సుసంగతము కాదు.

(3) నక్షత్ర మూలా – ఒక సంవత్సరములో సూర్యునకు పదమూడు మారులు చంద్ర మండల సంయోగము కలుగుచున్నది. కనుక సూర్య సంయోగమువలన వేరుపడి పదమూడు చంద్ర కక్షాఖండములు వెలయుచున్నవి. ఈ చంద్రఖండములను దాక్షాయణు లందురు. కశ్యపుని భార్యలుగ, ఇవి పురాణములు యందు వర్ణించబడినవి. ఇందొకతె, అచల, దానిని అదితి అందురు. అశ్విన్యాది యిరువది ఎనిమిది నక్షత్రములకు రెండు భాగములు. 1. రేవతి నుండి హస్త వరకు ఒక భాగము, రెండవది చిత్త మొదలు ఉత్తరాభాద్ర వరకు ఒక భాగము. ఇందు పదునాలుగు నక్షత్రముల పూర్వ భాగము. దేశమండలము, పదునాలుగు నక్షత్రముల ద్వితీయ భాగము దైత్య మండలము. దేవమండల మధ్య కేంద్రము నందు పునర్వసు ఉన్నది. తదీయ కేంద్ర బిందువును అదితి యందురు. దీనికి వ్యతిరేకముగా నున్న పదునాలుగు నక్షత్రముల మధ్య కేంద్రము నందు అభిజిత్తు ఉన్నది. దాని మధ్య బిందువును దితి యందురు. మరియు

పైన చెప్పబడిన ప్రాకృతిక అదితికి తాను ఆకాశమునందు స్వాతీ నక్షత్రమునకు ఉదయకాలము రేవతీ నక్షత్రము యొక్క అస్తకాలము అశ్వనీ నక్షత్ర స్థితి కాలము అయినప్పుడు చంద్ర మార్గమున ఖస్వస్తిక బిందు వుండును. అనగా పునర్వసు తృతీయ చరణము. ఈ ప్రకారము అదితి స్థానముగా నిశ్చితమగును. ఏలయన పైన చూపబడిన నక్షత్రముల స్థితి యందు పునర్వసు తృతీయ చరణమే ఖస్వస్తిక బిందువగును. దీని విపరీతముగ అభిజిత్తు తారకు దగ్గరగ నుండు బిందువు దితి స్థానమగును. అప్పుడిది అధస్వస్తిక అగుచున్నది. ఈ రహస్య నిరూపణమే "దేవస్యత్వాసవితుః" ఇత్యాది మంత్రముచే చెప్పబడినది.

(4) ఆకాశ మూలా – అశ్వనీ నక్షత్రము మొదలు చిత్రా నక్షత్ర పర్యంతము ఆకాశమండలము దైవ సంపత్తి యుక్తము. దీని మధ్య భాగము అదితి. స్వాతి. రేవతి, మధ్యస్త ఆకాశము దితి మండలము. ఈ అదితి దితితో కూడిన సంవత్సర సూర్య రూపము సర్వప్రాణ జనకము.

## కౌశికుడు

"కుశికస్త్వైషీరథి రింద్ర తుల్యం పుత్రమిచ్ఛన్ బ్రహ్మచర్యంచ చారతస్యేంద్ర ఏవ గాధీ పుత్రో జజ్ఞేగాధినో విశ్వామిత్రః" ఈ కాత్యాయన వచనము ననుసరించి ఇంద్రుడే, కౌశికుడు, విశ్వామిత్రుడు, ఈ ఇంద్రుడు "యధాగ్ని గర్భా పృధివీ తథా ద్యౌరింద్రేణ గర్భిణీ" అను శ్రుతి వచనానుసారము ద్యులోక

వ్యాపి సౌర ప్రాణము. ఇంద్రుడు స్వయముగ ఐతరేయ ఆరణ్యకమందు విశ్వామిత్రునకు తన స్వరూపమొ చెప్పుచూ "ప్రాణోవా అహమస్మిఋషే ప్రాణస్త్వం ప్రాణస్సర్వాణి భూతాని ప్రాణోహ్యేష య ఏష తపతిస ఏ తేన రూపేణ సర్వాదిశో విష్ఠాస్మి" అను శ్రుతిచొప్పున, తాను ప్రాణరూపుడుగా చెప్పెను. సూర్యుడు ప్రాణ రూపుడని చెప్పి తనకు సర్వ భూతముల యందు వ్యాప్తిని చూపుచు తనకు సూర్య రూపత్వమును సిద్ధింప చేసుకొనెను. ఈ ప్రాణము. "వాగ్వా అనుష్టుప్, ప్రాణోబృహతీ" అను వచనమున, బృహతియు అనబడును. ఇది భూతములం బ్రవేశించి చరాచరములకు ఆత్మ ఆయువు అగుచున్నది. ఈ ఆయుఃప్రాణమున్నంత వరకు జీవనము. అని కౌషీతకీశ్రుతి చెప్పును కనుక నిది అన్నింటికి మిత్రము. కనుక విశ్వామిత్ర ప్రాణ మనబడును. దీర్ఘాయుష్య ప్రాప్తికి ప్రాతస్సాయములందు మహర్షులు సూర్యోపస్థానమము చేయుదురు.

"శతాయుర్వైపురుషః" అను వచనము చొప్పున మనుష్యుడు నూరు సంవత్సరములు జీవించునను దాని రహస్యమునకు దీనికిని అనగా ఈ ప్రాణమునకును సంబంధము కలదు. ఇది అన్యత్ర అరయవచ్చును. ప్రస్తుతము విస్తర భయముచే విడువబడినది.

## వేద ప్రవర్తక ఋష్యధికారము

పైన ప్రాణాత్మక ఋషులు చెప్పబడిరి. ఆయా ప్రాణములను ప్రత్యక్షము చేసుకొని వాని రహస్యమును మంత్ర బద్ధమును చేయువారిని ఆ పేరుననే బిలుతురు. వారు ధర్మములను, విద్యలను సాక్షాత్కరించుకొని వ్యవహారమునకు ఉపయోగింతురు. వారు సాక్షాత్కర్తలు, ప్రధమోపదేశకులు, తదుద్భావనచే తద్రూపవిశేషోద్భావనచే ద్రష్టలు నలుగురు. తాముద్భావించిన ఆయా ప్రాణములందు వారు సిద్ధహస్తులు. కవులు అయిరి. యధేచ్ఛముగ ఆయా ప్రాణమునుండి దేవతలను, పితరులను ఆరాధించి తమ తమ ఈప్సితములను సంపాదించు కొనిరి. వారు వారుద్భావించిన ప్రాణములయు, ఉద్భావకులగు ద్రష్టలయు పేర్లు సమానముగ నుండుచుండును. కనుక వశిష్ఠ, భరద్వాజ, విశ్వామిత్ర మొదలగు శబ్దములన్నియు చయన యజ్ఞ నిరూపణస్తము లందు ప్రాణములుగనే చెప్పబడినవి. వాస్తవమున ఈ శబ్దములన్నియు విశ్వవ్యాప్తమగు అసల్లక్షణ ప్రాణబోధకములే, కాని, ప్రాణముల పేర్లు ఋషులకు, ఋషుల పేర్లు ప్రాణములకు, కూడ కొన్ని చోట్ల వాడబడినవి. ఋషుల మొదటి పేర్లు ఏవి అయినను యశోనామములే ఎక్కువగ, నిలిచియున్నవి. కొందరి యాదృచ్ఛిక నామములు కూడా లేకపోలేదు. భరద్వాజుని యాదృచ్ఛక నామము, విదధియట. ఇట్లు వాక్కు, జుహు, దక్షిణ, శ్రద్ధ, మొదలైనవి కూడ తత్తత్ప్రాణములను ఉద్భావించిన ఋషుల పేర్లే.

కొన్ని చోట్ల ఇందుకు విపరీతముగ ఉద్భావిత ప్రాణములకు ఆయాప్రాణము ఉద్భావించిన ఋషుల పేర్లే పెట్టబడినవి. ఉదాహరణము, కుమారుడు, లేక అప్రతిరథుడు, కుమార నామక మత ప్రాణమును, కుమారుడను బ్రాహ్మణ బాలకుడు కనుగొనును. ఆ బాలకుడు త్రైవృష్ణుడను రాజు చక్రాఘాతమున

చచ్చినట, దృశజానుడు అతనిని బ్రతికించెనట, అతడు కనుగొన్నది కుమార ప్రాణమును. ఇట్లే ఇంద్ర పుత్రుడు అప్రతిరథుడు యుద్ధ విజయమును గూర్చు ఇంద్ర ప్రాణమును కనుగొనెను. ఆ ప్రాణునకు అప్రతిరథమని పేరు. కన్ని చోట్ల అనగా చాల వరకు ప్రాణ పేరు ఋషికి వచ్చుటయే చూచుచుందుము.

కొందరు వశిష్ఠప్రాణమును కనుగొనుటచే వశిష్ఠుడు కాదు. ఆ కనుగొన్న వాని యందు ఆయా ప్రాణ ప్రాధాన్యత కూడ ఉన్నది. అందువలన ఆ వ్యవహారమేర్పడుట యుక్తమే యందురు. "శ్రద్ధామయోయం పురుషః। యోయచ్ఛ్రద్ధస్సఏవసః" అను చొప్పున వశిష్ఠ ప్రాణశ్రద్ధగల వ్యక్తి వశిష్ఠనామమున వ్యవహృతుడయ్యె, ఇట్లే తక్కిన యెడలను అనవచ్చును.

ఈ వేద ప్రవర్తక ఋషులు ప్రధానముగ, మత్స్య, వశిష్ఠ, అగస్త్య, భృగు, అంగిర, అత్రి, కశ్యప, కౌశికులు, అనగా వేద మంత్ర నిర్మాతలు ఈ ఎనమండుగురే యని అభిప్రాయము కాదు. వీరి వంశము వారున్ను ప్రాకృతిక ప్రాణములను దర్శించి ఆయా రహస్య నిరూపక వేదమంత్ర నిర్మాణమును చేశియు ఆ వంశమూల ఋషుల పేరుననే ప్రశిద్ధులయిరి. వశిష్ఠాదులు గోత్ర నామములు, వీరు వంశజులును, వశిష్ఠాదులే, కాగా, వశిష్ఠ వంశము వారు నిర్మించినది వశిష్ఠ సంహిత యనబడును. ఇట్లే అన్ని సంహితల విషయమునను యెరుంగునది. ఆ ఎనిమిదింటి నామమములను ఇందు పేరు కొందుము.

1. వశిష్ఠ సంహిత, 2. అగస్త్యసంహిత, 3. భృగుసంహిత, 4. అంగిరస్సంహిత, 5. అత్రి సంహిత, 6. కశ్యప సంహిత, 7. కౌశిక సంహిత. మత్స్య మహర్షికి చెందినది ఒక మంత్రము మాత్రమే కలదు. వారి వంశజులు ఏ వేదమంత్ర నిర్మాణమును చేసినట్లగుపడదు. వారికి వేరుగా సంహిత లేదు. ఇందును (అంగిరస్సంహిత) అధర్వ సంహిత, ఘోర సంహిత, గౌతమ సంహిత, ఉతధ్య సంహిత, బృహస్పతి సంహిత. గణధర సంహిత అని ఆరు భేదములు. ఇందును ఘోర సంహితయన్నది. కణ్వ సంహిత, ప్రగాధ సంహిత, అని తనతో మూడు విధములయ్యెను.

ఇవి గాక విప్రకర్ణ సంహిత ఒకటి కలదు. ఇందు మంత్ర ద్రష్టలు, బ్రహ్మ ఋషులు, రాజ ఋషులు, స్త్రీలు, శూద్రులు, నిర్మించిన మంత్రములు కలవు. ఇది ఆభాస సంహిత యందురు.

1. రాజఋషి సంహిత, అబ్రాహ్మసంహిత, బ్రహ్మవాదినీ సంహిత, ఉద్భట సంహిత, అని తనతో అయిదు భేదములు కలది. ఇందు మంత్రకర్తల పేర్లు తెలియవు. అవ్యక్త భూతార్థములే ఇందున్నవి. ఇందు ఇరువది నాలుగు వర్ణములు కలవు. ఇందులో ఎనిమిది వర్గములు, దైవత వ్యపదేశము; ఈ మంత్రములందు వక్తృత్వముచే కల్పింపబడిన యర్థము దేవతాస్వరూపములు. పది వర్గములు ఋషి వ్యపదేశములు. ఆరు వర్గములు తిర్యగ్వ్యపదేశములు. ఇందు వరుసగ, వక్తృత్వ కల్పితార్థములు ఋషితిర్యగ్వర్గములు. రాజఋషి సంహిత యందు రాజ ఋషులు కనుగొన్న మంత్ర సంగ్రహములున్నవి. ఇందు అయిదు వగన్ములు. 1. కాశిరాజవంశము, 2. భారతవంశము, 3. వర్షాగిరవంశము, 4.మాంధాత్రాది గణము, 5. సుమిత్రాదిగణము అబ్రాహ్మి సంహిత యందు శూద్రులు కనుగొన్న

మంత్రముల సంగ్రహము కలదు. బ్రహ్మ వాది సంహిత యందు బ్రహ్మ వాదినులు అగు స్త్రీలు నిర్మించిన మంత్రములు కలవు. బ్రహ్మవాదినులు ముప్పది మంది ఉద్భట సంహిత యందు బ్రాహ్మణ కల్ప గ్రంథముల యందు లభించు మంత్ర సంగ్రహము కలదు. దీనికి ఋషి వామదేవుడని శాంఖాయన వచనము కలదు. “అను కృష్టస్తు యఃకశ్చిత్ కల్పోధబ్రాహ్మణోపివా। మత్రఃపద్యోధగద్యోవా, వామదేవ్యం నిబోధత” అనిశాంఖాయన వచనము.

పైన చెప్పబడిన వేదమంత్ర ద్రష్టలు నాలుగు భేదములు కలవారు.

1. శతర్చి, 2. మధ్యమ, 3. మహాసూక్త, 4. క్షుద్రసూక్త, నూరు ఋక్కులు రచించిన వాడు శతర్చి తక్కిన వారు వకరికంటే నొకరు తక్కువ రచించిన వారు. ఋగ్వేదము నందు ప్రథమ మండల ప్రణేతలు శతర్చులు 2 మొదలు 9వ మండలం వరకు నిర్మాతలు మధ్యములు 10 మండలమందు, నాసదీయ సూక్తము నుండి పూర్వ మంత్రముల నిర్మాత మహాసూక్తుడు. తదుత్తర సూక్త నిర్మాతలు క్షుద్ర సూక్తులు.

# గోత్ర ప్రవర్తకాధికారము

గోత్రశబ్దమునకు గల అర్థ విషయమున ఆచార్యులందు భిన్న భిన్న మతములు గలవు. వానిని సంగ్రహముగ చూతము. విజ్ఞానేశ్వరాది ఆచార్యులు గోత్రమును వంశ పరంపరా ప్రశిద్ధ మందురు. “వంశ పరంపరా ప్రసిద్ధం గోత్రం” “స్వ మానేపి బ్రహ్మణ్యే కుండినో త్రిరితి స్మరణ లక్షణం గోత్రం” ఇవి భట్టపాదుల మత మిది. “ప్రవరఋషి సంబద్ధ ఋషయో గోత్రం” ఇది సత్యాషాఢాదులమతము, “భృగ్వంగిరో అత్రయః కశ్యపో వశిష్ట విశ్వామిత్ర అగస్త్యాశ్చ ఇత్యేతే సప్త ఋషయః స్వాపత్యానాం గోత్రం” ఇది యొక పెద్దల మతము. ఈ మతమును ఏడే గోత్రములగును. “భృగ్వంగిరోత్రీణాం కశ్యపస్య వశిష్ఠ విశ్వామిత్ర అగస్త్యానాంచ ఇత్యేతేషాం సప్తానాం ఋషీణాం అపత్యంగోత్రం” ఇది యొక దృష్టి దీనింబట్టి అసంఖ్యాత గోత్రము లగును. “సప్తఋషి అపత్యాని స్వాపత్యభూతానాం పరేషాంపూర్వేషాంచ సప్తఋషీణాం గోత్రాణి” ఇతి అని ఒక దృష్టి, “సప్తఋషి అపత్యాని స్వాపత్యభూతానాంపరేషామేవగోత్రాణి నపూర్వేషాం” నచపరంపరయా అస్మదాదీనామపి సప్తఋషి అపత్యతయా గోత్రత్వాపత్తిః ప్రసిద్ధ్యేవ తన్నిరాసాత్ గోత్రత్వేన ప్రసిద్ధస్య సప్తఋషి అపత్యస్యేవ గోత్రత్వాత్”, ఇది యొక దృష్టి “జమదగ్నిః గౌతమ భరద్వాజౌ అత్రిః కశ్యపః వశిష్ఠః విశ్వామిత్రః అగస్త్యః ఇత్యేతే అష్టౌఋషయః స్వాపత్యానాం గోత్రం” ఇది యొక దృష్టి ఇందు యెనిమిదే గోత్రము లగును. “అగస్త్యాష్టమానం ఏషాంసప్త ఋషీణాం యదపత్యం తద్గోత్రం” అని ఒక దృష్టి, బోధాయనాదులు దీని నంగీకరింతురు ఇచట నొక ఆక్షేపము కలదు. కేవలము భృగువులు, కేవలాంగిరసులు ఇందు చేరలేదు. కాగా, “ఏక ఏవఋషిర్యావత్ ప్రవరే ష్వనువర్తతే। తావత్సమాన గోత్రత్వం ఋతే భృగ్వంగిరో గణాత్॥” అను నీ బోధాయన వచనము నందు గోత్ర శబ్దము ప్రవర పరక మనవలయును. కాని నాడు “వినా భృగ్వంగిరో గణాత్” అను వచనము ద్వారా వారికి గోత్రత్వ నిషేధము

చేయుట వ్యర్థము అగును. కనుక, గోత్ర మన ప్రవర యనియే అర్థము, చెప్పవలెను. ఇచట ప్రకరణమున్ను, ప్రవర్తలకు చెందినదే కాని గోత్రములకు చెందినది కాదు. భృగ్వంగిరులను విడచి సమాన ప్రవరలందు వివాహము కూడదని కదా బోధాయన వచనమున కర్థము. మరియు, "ప్రవరాన్ వ్యాఖ్యాస్యామః త్రైర్గోత్రాణి" అని సత్యాషాఢుడు, కేవల భృగు, కేవల అంగిరను గోత్రముగ చెప్పి యున్నాడు. ప్రవర ఋషి సంబద్ధ ఋషియే గోత్రం, అతనికిని ప్రవర ఋషులతో సంబంధమున్నది. ఇట్లు గోత్రమునకు నానావ్యాఖ్యలున్నవి.

వస్తుతః వ్యవహిత అనగ, మూల పురుషు నుండి తృతీయాది అపత్యములందు సన్నివిష్టమయిన, మూల భేత ఋషి యంశమే గోత్ర మందురు. పితృదేహమందలి సోమ భాగమయ సహఃపిండములకు తదీయ సంతానము లందు అనువృత్తి యగునట్లు, భృగు, అంగిర, అత్రి, ఆది ఋషి ప్రాణములకును ఉత్తరోత్తర సంతానము నందు అనువృత్తి కలుగుచున్నది. సంతానము లందు అనువర్తమాన మగు ఋష్యంశమే గోత్రమనంబడును.

ఇట్లు భృగ్వంగిరోత్రి వశిష్ఠా గస్త్యకశ్యప విశ్వామిత్రు లేడుగురే మొదట మూలగోత్రములుగ నుండిరి. ఈ సప్త గోత్రముల అంతర్గతులే జగత్తు నందలి అందరును. ఇందు భార్గవ గోత్రము. జామదగ్న్య (భార్గవ) కేవల భార్గవ భేదముచే రెండు భేదములు గలది. అంగిరస గోత్రము. గౌతమ, భరద్వాజ, కేవ లాంగిరస భేదముచే మూడు శాఖలు గలది. ఇట్లు జామదాగ్న్యా, భార్గవ, గౌతమ, భరద్వాజ, అంగిరస, ఆత్రేయ, వశిష్ఠ, అగస్త్య, కశ్యప, విశ్వామిత్ర, ఇవి పది గోత్రములు. ఇందు జమదగ్నికి రెండు భార్గవున కైదు, గౌతమునకు ఏడు భరద్వాజునకు నాలుగు. అంగిరస్సునకు ఆరు, ఆత్రేయునకు నాలుగు, వశిష్ఠునకు నాలుగు. అగస్త్యునకు నాలుగు, కశ్యపునకు మూడు, విశ్వామిత్రునకు పది, భేదముచే మొత్తము నలుబది తొమ్మిది గోత్రములగునని బోధాయనాచార్యుని మతము.

కొందరు ఎనుబది మూడు గోత్రములను అంగీకరించు చున్నారు. ఆ మతమున, జమదగ్ని 2 భార్గవుడు 10 గౌతముడు 10 భరద్వాజుడు 4 అంగిరసుడు 8 అత్రి 7 వశిష్ఠుడు 5 అగస్త్యుడు 10 కశ్యపుడు 5 విశ్వామిత్రుడు 22.

ఆపస్తంబుడు నూటికధికముగ గోత్రములను చూపుచున్నాడు. అవాంతర భేదములను బట్టి పెక్కు గోత్రములు అగును. నేడు దేశ భేదమును బట్టి గోత్ర సంఖ్య భిన్నముగ, కనుబడుచున్నది.

పైన చెప్పబడిన నలుబది తొమ్మిది, యనుబది మూడు అన్నవి ఏకగోత్రీయ వంశములు, ద్వ్యాముష్యాయణము లనబడు ద్విగోత్రయ వంశములు, ఇంత కంటే భిన్నములు. ఇందు పూర్వ సిద్ధములు, సమయ సిద్ధములు అని రెండు భేదములు పూర్వ సిద్ధము, శౌనక, దేవరాత వామ రథ్య ధనంజయ జాతూకర్ణ్య కాత్యాయన, కాపిల, వౌగాక్షి, సంకృతి, శౌంగశైశిరి అని పది విధములు. ఇందు ద్విగోత్రత అనగా మొదట వీరు ఒక గోత్రము వారు. పిమ్మట దత్తత స్వీకార విధముననో మరొక విధముననో అన్యగోత్రులయిరి. వివాహాదు లందు ఈ ఉభయగోత్రములను విడచి వ్యవహరించు కొనుట యుక్తము.

ఈ పై పది ద్విగోత్రములందును మొదటి ఏడును అంత ప్రచారమున లేవు. తక్కిన మూడును విశేష ప్రచారమున యున్నవి. వీని ద్విగోత్రత స్మృతి పురాణాదులందు వర్ణింపబడి యున్నది. శాస్త్రమందుల్లేఖింపబడని, ద్విగోత్రత అనగా దౌహిత్రులు. కృత్రిములు, దత్తకులు, స్వయందత్తులు క్షేత్రజులు మొదలైన వారు సమయ సాధ్యద్వ్యాముష్యాయణు లందురు. వీరి ద్విగోత్రత శ్రాద్ధ వివాహాది భేదములచే వ్యవస్థితమై యున్నది. శ్రాద్ధాదులందు జనకుని ద్వారా జాతకాది సంస్కారము లొనర్పబడిన వారే ద్విగోత్రులు. ప్రతి గ్రహీత ఉపనయనము చేసినప్పుడున్ను అంతే ప్రతి గ్రహీత జాత కర్మాది సంస్కారములు చేసినప్పుడు పితృగోత్ర మతనికి యుండదు. ఈ వ్యవస్థ శ్రాద్ధ పద్ధతి యందు కలదు. వివాహము లందు రెండు గోత్రములను విడవ వలశియే యుండును. పైన చెప్పబడిన వన్నియు బ్రాహ్మణ విషయములు. వివాహాది కార్యములందు వ్యవహారమున భేదము తప్ప తక్కిన కార్యములందు ఎందును అన్యోన్యగౌరవ ప్రాశస్త్యములకు, ఎక్కువ తక్కువలను గూర్చిన విధి నిషేధములు అగపడవు. బ్రాహ్మణేతరులకు గోత్రములు నియతములై యున్నవి. క్షత్రియులకు, మానవ గోత్రములు, వైశ్యులకు భాలందన గోత్రములు, శూద్రులకు, కాశ్యప గోత్రములు కలవు. గోత్రముల జూడ తెలియని వారు జామ దగ్న్య గోత్రీయు లగుదురని శాస్త్రీయ నిర్ణయము.

## ప్రవర

ఒక గోత్రము నందు అవాంతర భేదమును కల్పించు గోత్ర వ్యావర్తక ఋషులు ప్రవర యందురు. ఒక్కొక్క గోత్రము నందు 5 - 3 - 2 - 1 ఇట్లు ప్రవరులుండును. పైన చెప్పబడిన గోత్రములందు పంచ ప్రవరలు 9 మూడు ప్రవరలు గలవి 68 రెండు ప్రవరలు గలవి 6. మొదలుగా గలవు. వాని వాని వివరములను, ఇంకను గల వివరములను మూల గ్రంథములును బట్టి యెరుంగ వలయును. ఇచ్చట వివరించవలసిన పని లేదు.

వస్తుతః ఇందలి మత భేదములకు ధర్మము శాస్త్రములందు ఏ ఉపయోగమును కనుబడదు. మత భేదమును బట్టి ధర్మము నందు విరోధము రారాదు. అట్లు ఉన్నచో విరోధి ధర్మము, ధర్మమే కాదు, అవిరోధి ధర్మమే ధర్మమగును కనుకనే, "ధర్మంయోబాధతేధర్మః నధర్మః పరికీర్తితః। అవిరోధీతి యోధర్మః సధర్మః సద్భిరుచ్యతే।"-

ఇంత వరకు వేదముల యొక్కయు, ఆగమముల యొక్కయు వివరములు సంగ్రహముగ చెప్పి ఋషుల యందలి భేదములను వారి వారి స్వరూపములను. కార్యములను దిఙ్మాత్రముగ సూచింతిమి. భగవంతుడు అతని విలాసము అనంతమైనపుడు ఆయా భేదవివరణమును అనంతమే. అని విజ్ఞులకు వేరుగా జెప్ప పని లేదు. ఇచ్చట ఈ పుష్పదంతుని వచనము గమనింపదగినది. "అసితగిరిసమంస్యాత్కజ్జలం సింధు పాత్రే సురతరువరశాఖా లేఖినీపత్రముర్వీ లిఖతియది గృహీత్వాశారదాసార్వకాలం తదపి తవ గుణానా మీశ పారం నయాతి" -

ఇంతవరకునైన చర్చ ఏ మతముల పొంతకుపోక కేవల వేదవిజ్ఞానానుసారముగ చేయబడినది. వేదమునందు ఆస్తిక నాస్తిక మతముల కన్నింటికిని ఆధారములు లేక పోలేదు. భిన్న ప్రకృతులగు మానవులు తమ తమ ఇష్టానుసారము మతముల నేర్పరుచుకొని, భగవదారాధనము చేసికొన్న విధము ప్రపంచ చరిత్ర విశదము చేయుచున్నది. సృష్టి కర్తకును, మానవునకును గల సంబంధమును గూర్చిన ఊహాపోహాలే తర్క వితర్కములే, పూర్వ పక్ష సిద్ధాంతములే, మతములుగ వెలసినట్లు గోచరించును. ఇందేదియు, ఉచ్చమని గాని, నీచమని గాని చెప్పుటకు ఎవరికి ఎట్టి అధికారమును లేదు. అన్నిటికన్నీ ఆకరము లున్నవి కదా. కాని –

చాలకాలము వరకు పూర్వ యుగము లందు అట్టి ఐకమత్యముతో మానవ సంఘము చక్కగ వర్థిల్లినట్లు గోచరించును. పిమ్మట ఇటీవల ఎవరికి వారే తమ తమ మతములందు స్వార్థ బుద్ధిని వహించి ధర్మాచరణమునందు మనః ప్రవృత్తి తగ్గించుకొనుచు బాహ్యాడంబరముల యందు శ్రద్ధ వహించినట్లు పొడకట్టును. దీనితో పరస్పర దూషణ కల్పనలు చేయుచు ఆయా కల్పిత విషయములను తమ తమ స్వార్థమును సంపాదించుట కొరకు అనగా ఖ్యాతి, లాభ, పూజార్థము పూర్వగ్రంధములందు ప్రక్షిప్తములు చేయుచు వచ్చినట్లు విమర్శల వలన తేలుచున్నది. ఇందు కేవలము మతమునకు జెందిన, ఆగ్రహమే అగపడును గాని కావలశిన, ఉండవలశిన, ఆచరణ సంపత్తి, గుణ పరివర్తనము, భక్తి భావము, జ్ఞాన ప్రకాశము, శూన్యములు కాజొచ్చినవి, ఎవరిది వారికే నిక్కమని తోచుటయందు, ఆచరించుట యందు. తప్పులేదు గాని, ఒకరినొకరు దూషించుకొనుట ఆ దూషణలను గ్రంధస్థముగ జేయుట పరమాసహ్యాము.

ఈ అసహ్యాగుణము, అసహ్య చేష్టలు, ఒక కులమునందు, ఒక జాతియందు, ఒకే మతమునందు గూడ అనేక విధములుగ చీటికలు కల్పించి, ఉచ్చనీచ లేర్పరచి ధర్మ పరిపాలనమున్నూ వీడి గ్రంథ పరిపాలనమునే ముఖ్యముగ బెట్టుకొని వర్తించుట మరింత అసహ్యాముగ దోచును. చాతుర్వణ్యము లందు ఒక్కొక్క వర్ణమున వృత్తులను బట్టి అనేక శాఖలుగా జీలి, అందు ఎన్నో హెచ్చు తగ్గు లెన్నుకొనుచు, వర్తించు విధము చూచినప్పుడు, ఈ అకాండ తాండవ మంతయు ఆశ్చర్యమును విచారమును కలిగించును. "ప్రకృతి విశిష్టం చాతుర్వణ్యం సంస్కార విశేషాచ్చ" అను సూత్రము యొక్క విలువయు, వ్యాప్తియు,పూర్తిగ జెడి ధర్మమడుగంటి, మంతములందలి మాలిన్యము, పై కుడికి, కలహకారణమైన విధము, ప్రపంచము విశదము చేయుచున్నది. వర్ణాశ్రమ సంస్కార విజ్ఞానమున నైకమత్యముతో ప్రవర్తించి నంతకాలము ఏ కలహము లేదనియు, మతము లందు ధర్మమడుగంటి కల్పనా సిద్ధాంతములు ప్రబలి, దంభాచారములు పెచ్చు పెరుగుట వలననే అశ్రాంత కలహయోగము ప్రపంచమునకు దాపురించినదనియు, ప్రపంచ చరిత్రలు విశదము చేయుచున్నవి. చివరకివి, దైవ సంబంధమును విడచి, కేవల భౌతిక సంబంధమున, రాజకీయ మతములుగ మారి, యెంత అశాంతిని రేపుచున్నవో, రేపనున్నవో చెప్పనక్కరలేదు.

శంకరాచార్యులువారు ఒకచో "అద్యష్టమీతినవమీతి చతుర్ధశీతి జ్యోతిష్మవాచోప వసంతి భక్త్యా, శ్రుతేస్త్వహోతత్త్వ మసీతి వాక్యం నవిశ్వసంత్యద్భుతమే తదేవ" అన్నారు. ఆవిధము ఇప్పుడెల్లెడలను సామ్రాజ్యము సాగించు చున్నది. ఉదాహరణమునకు, ఒకే కులము నందు వచ్చిన ఒక, కలహ సన్నివేశమును ఇచ్చట నుదహరించెదము. దీనిని పరిశీలించినప్పుడు, వేదమువేదమని పొగడుచున్న వారి యందు వేదసామరస్యము నందు ఎంత గౌరవము శ్రద్ధయు, వేద ఋషుల యందు ఎట్టి భక్తి ప్రపత్తులు కలవో తెల్లము కాగలవు.

నాలుగు వర్ణములందు బ్రాహ్మణ్యము ఒక జాతి. అందు వేదాగమములచే ప్రతిష్ఠితములైన దేవాలయ తనములందు దైవము నర్చించు తెగ ఒకటి కలదు. ఈ అర్చకులందు శైవ వైఘానసాది భేదము లుండుగాక, వీరిలో వైఘానసులన్న వైష్ణువులకు పడదు. దివ్యస్థలము లనబడు వాని యందు వారు వండిన వంటకము. నివేదనకు అర్హము కాదట పాచకుడొకడు, నివేదన చేయు వాడింకొకడు (వైఘానసుడే) నివేదన జరిగిన పిమ్మట నది సర్వులకు ప్రసాదముగా భోగ్యమేనట, ఈ వైఘానుడు, వైష్ణవపంక్తిబాహ్యుడు, వైష్ణవులందును కొందరు పురుషపాక భోక్తలు మాత్రమే. ఆ ఈ అన్నింటికి వారు వారు వారి యాగమ వచనములను చూపుదురు. ఇందందరును, ఎవరికి వారే గొప్పవారుగ, తక్కిన వారిని కొలది వారిగ చూపుచుందురు. ఇట్లే శివాచన్‌కు (శివార్చకు) లందును పెక్కు భేదములు వెలసియున్నట్లు కనుగొందుము. సామాన్య బ్రాహ్మణ్యమునకు వీరు పంక్తి బాహ్యులు అన్నచో వీరికి సామాన్య బ్రాహ్మణులును పంక్తి బాహ్యులే, నిక్కముగ నైనచో సామాన్య బ్రాహ్మణులు దేవుని స్పృశింపరాదు, సామాన్య బ్రాహ్మణులు అచన్‌కుని (అర్చకుని) స్పృశింపరాదందురు. ఇంతకు దేవార్చన మన్నది అందరకును పవిత్రత కూర్చుటకే అన్నచో అర్చకుడపవిత్రుడని, పంక్తి బాహ్యుడని భావించుట యెట్టిది. అపవిత్రుడర్చించు దేవుడు తక్కిన అందరకు పవిత్రుడెట్లు? పవిత్రత కూర్చుట యెట్లు? అది అటుంచుడు. ఇందు ఎవరి ప్రమాణములు వారు చూపనిందు.

లోగడ వ్రాత యందు వేదములకు ఆగమములకు భేదము సహేతుకముగ నిరూపింపబడినది. ఒకటి సూర్య విద్య, మరొకటి చంద్ర విద్య ; సూర్య చంద్రులకున్న భేదము వీనికి కలదు. అనవచ్చును. కాని సూర్యుని కాంతియే చంద్రునిది. చంద్రునకు సహజ కాంతి లేదు. కాని సూర్య కాంతి వేడి, చంద్ర కాంతి చలువ, ఒక్క మాటలో వీరిని పుష్పవంతులందురు. ఈ ఇరువురకు అవినాభావ సంబంధము కలదు. ఈ సంబంధము అగ్నీషోముల సంబంధమే. అగ్ని గర్భమందు సోమము, సోమ గర్భమందు అగ్ని, ఆ యీ దృష్టితో సూర్యచంద్రులు ఏకమనవచ్చును. అట్లే వేదాగమములకు అభేదము చెప్పవచ్చును కాని సూర్య కాంతి అభ్రాంతము. చంద్రకాంతి సభ్రాంతము అని మరువరాదు. మనోబుద్ధులు రెండును ఒకటి కావు కదా, ఒకటి నిశ్చయాత్మకము, మరొకటి సంశయాత్మకము, విజ్ఞుల కింతటితో చాలును, విస్తరింప బనిలేదు.

పై స్తితి ఇట్లుండ ఈ క్రింద ఉదహరించిన ఆగమ వాక్యములు, యెంత వరకు సమన్వయ మార్గమును బట్టినవి. అన్నది పరిశీలింతము

కామికాగమము, ఆచార్య లక్షణపటలము.

"అగస్త్యోగౌతమశ్చైవభరద్వాజోథకాశ్యపః। కౌశికశ్చైవపంచైతేపంచవక్త్రేషుదీక్షితాః తేషాం ఋషీణాం వంశేషుజాతాశ్చైవశివద్విజాః।" శ్లో 3 1/2 అని వీరు శివుని ముఖముల నుండి ఈ క్రింద వ్రాసిన విధముగ దీక్ష పొందినట్లు 8 లగాతు పది శ్లోకముల వరకు చెప్పబడినది. ఊర్ధ్వమగు ఈశానము నుండి శివగోచరుడుగ కాశ్యపుడు, తూర్పు దగు తత్పురుషము నుండి శివగోచరుడుగనే కౌశికుడు. దక్షిణమందలి అఘోరముచే జ్యోతిగోచరుడుగ భరద్వాజుడు. ఉత్తరమందలి వామదేవముచే సావిత్రి గోచరుడుగ గౌతముడు. పశ్చిమ మందలి సద్యోజాతముచే అగస్త్యుడు, దీక్షపొందినారు.

గోచరమనగా కులమనియు. ఈ కులములందు బుట్టిన వారు ఆదిశైవులనియు చెప్పబడినది. ఇది ఇట్లుండగ – "కైలసస్థశివాచ్చాపిసంతానానిసముద్భవం। అనియు నందే కలదు. మరి 11 (పదకొండు) శ్లోకం లగాయతు శివుని మూర్ధమునుండి ఆచార్యుడున్ను, ముఖము నుండి అచన్కుడున్ను (అర్చకుడు), హృదయము నుండి స్థానికుడును, గుహ్యము నుండి పాచికుడును, పాదము నుండి పరిచారకుడును పుట్టిరట, ఆ పిమ్మట వారి వారి పనులు చెప్పబడినవి. కాని ఆ దీక్ష పొందిన ఋషుల పుట్టుక ఎటనుండియో అచట తెలుపలేదు. కాని మరొకచో శివమూర్ధముల నుండి అయిదు జ్యోతులు వెలువడినవనియు అవి కాశ్యపాదులేయనియు చెప్పిరి. పిదప "జ్యోతిభ్యశ్చ తథాజాతం ఆచార్యం చేతి కీర్తితం।" అని కలదు ఇందువలన జ్యోతుల నుండి అట్లు పుట్టినది ఆచార్యమనియు యనబడినది. అని వ్రాయబడి యున్నది. ఆ పిదప శివుని ముఖముల నుండి అచన్క (అర్చక) గోత్రములకు మూలమగుచు శివ సృష్టియని కీర్తినందిన ఇరువది ఋషులు పుట్టిరని వారి పేర్లు ఈయబడినవి. ఇది అచన్కవర్గమట. ఇట్లే హృదయము నుండి పుట్టిన స్థానిక వర్గము వారి పేర్లు ఉటంకించ బడినవి. పిమ్మట నాభి దేశము నుండి పుట్టిన పాచక వర్గము వారి పేర్లున్ను. పిమ్మట జన్మ స్థానము ఉటంకించకయే పరిచారక వర్గము ఋషుల పేర్లున్ను వ్రాయబడినవి. వీరందరు శివ సృష్టియందు పుట్టిన వారనియు, శివుని మూర్ధమునుండి పుట్టిన శైవబ్రాహ్మణులు ఆదిశైవులను పేరుగల వారనియు కేవలము బ్రహ్మముఖము నుండి పుట్టిన ఇతర ఋషులు సామాన్య బ్రాహ్మణులనియు ఇత్యాదిగా చెప్పబడినది. ఇంకను.

నిత్యనైమిత్తిక కామ్యములు ఆచార్యుడు ఆచరింప వలయును. కేవలం నిత్య పూజ అచన్కు (అర్చకు) నకును విధింపబడుచున్నది. అతడు కామ్య నైమిత్తికములు చేయరాదట. స్థానీకుడు ఉత్సవ విగ్రహములకు అలంకార క్రియాకరుడుట. శివాగ్నిచే పచనము చేయుట పాచకుని పని. అభిషేకమునకు తీర్థము పూజోపకరణాదులు తెచ్చుట మాత్రము పరిచారకునిపని. ఇతరము అతనికి పనికి రాదట.

ఆచార్యునకు 7 సంస్కారముల యందు అధికారము కలదనియు తక్కినవారికి అనగా అచన్కు(అర్చకు) నకు స్థానికునకు పాచకునకు । పరిచారకునకు క్రమముగ మొదటి నుండి వక్కొక్క సంస్కారము నందధికారము తగ్గుచూ వచ్చుననియు. భూతిదానవిధియందు ఆచార్యునకే అధికారమనియు

అతడు లేనియెడల అచన్కు (అర్చకు) నకు మాత్రమే అధికారమనియు తక్కిన వారెవ్వరికిని ఆ అధికారము లేదనియు, చెప్పి చివరకు ఆచార్యాధిగా పరిచారక పర్యంతం ఆయా సంస్కారానుగుణ్యముగ, "పంచాచార్యమితిఖ్యాతం" అనుచు స్థానిక కులము నందు పుట్టినవాడు సమయి అనియు. పాచక కులమందు పుట్టిన వాడు సాధకుడనియు. పరిచార కుల మందు పుట్టినవాడు పుత్రకుడనియు. సర్వసాధక బోధకమగు ఆచార్యత్వము ఆయాకర్మాను గుణముగ మూడు విధములనియు చెప్పబడినది. ఇందు అచన్కుడు (అర్చకుడు) విడవబడెనని జ్ఞప్తి యుంచవలెను. మరియు

ఆచార్యుడు పుత్ర హీనుడైనచో ఆచార్య కులము నందు పుట్టిన వానినే దత్తతస్వీకారము చేసుకొనవలెనని చెప్పుచు, పంచానన గోత్రముల యందు పుట్టిన వారు ఆచార్య కులము వారని వాకొనబడినది. తక్కిన వారు పుత్ర హీనులయినచో వారిపై గణముల వారి పుత్రులను దత్తు చేసుకొన వచ్చును గాని స్వీకరించిన వారి అధికారములే వారి కుండుననియు కంఠోక్తిగా చెప్పబడినది. ఇట్లే వివాహాది కార్యములందు కన్యాపరిగ్రహణ విషయమునను చెప్పుచు క్రింద వారి కన్యలను పై వారు గ్రహించవచ్చుననియు అప్పుడు తత్సంతానము ఏ తరగతికి చెందు నన్నది స్పష్టబరచ బడలేదు కాని పై తరగతి వారి కన్యను క్రింది తరగతి వారు పరిగ్రహించరాదని మాత్రము స్పష్ట పరుపబడినది.

ఇది ఇట్లుండగా కారణాగమమునందు ఇదే ప్రసంగము పట్టున, ప్రజాపతి సిద్ధాంతానుసారమని పంచశైవులను చెప్పుచు సదాశివుడు అనాది శైవుడనియును. ఆది శైవులు శివబ్రాహ్మణులు అనియు. సదా శివుని నుండి దీక్షపొందిన వారు ఆది శైవులనియు, కౌశికాదులు అయిదుగురు అట్లు సదా శివ పంచవక్త్రములందు దీక్ష పొందిరనియు, చెప్పుచు అందు గోచరములందు కొంచెం భేదమును. ముఖము లనుటకు మారు మూర్తులని, శివ, ఈశ్వర, ఈశాన, బ్రహ్మ, మూర్తులని చెప్పి అగస్త్యునకు ఊర్ధ్వవక్త్రముచే దీక్ష యనియు చెప్పబడినది. ఇట్లే మంత్రములందును, గుహ్య, వామ, అఘోర, బహురూప, ఈశ మంత్రములచే దీక్షలని పేర్కొనబడినది. ఇక కామికము నందు అయిదుగురు ఋషులను వేరుగ చెప్పి వారి దీక్షలను వేరుగా నిర్ణయింపుచు వారు ఆదిశైవులని చెప్పుచు వేరుగ, ఆచార్య, అర్చక, స్థానిక, పాచక, పరిచారకుల ఉత్పత్తిస్తానములను వేరు వేరు చూపుచు, యెవరికృత్యములు వారికి నిర్ణయింపబడగా, ఇందు అదేమియు లేక, శైవులు అయిదు విధములు అయిన వారనియు. అందు (1) అనాదిశైవుడు సదా శివుడేయనియు అతనిచే దీక్ష పొందిన పై రుషులు అయిదుగురును (2) ఆదిశైవులనియు, గోచరమనగా కులమనియు, ఈ అయిదు కులముల యందు పుట్టిన వారు స్థాపనాది క్రియలకు ప్రవర్తకులనియు, వీరందరు ఆదిశైవులనియు చెప్పబడినది. మరి (3) విప్రులు, మహాశైవులనియు (4) నృపవైశ్యులు అను శైవులనియు (5) శూద్రులు ఉత్తరశైవులనియు చెప్పుచూ బింద్వర్థముచే ఆశ్రితులయిన వారు ఆదిశైవులు, అనుశైవుల నాశ్రియించిన వారును అనుశైవులే. అనుచు ఆ ఈ మహాశైవానుశైవాంతరశైవులు తమ కొరకు తాము దేవ పూజచేసుకొనుటకే కాని పరార్థమునకు పనికిరారనియు. ఆత్మార్థ పదార్థములందు ఆదిశైవులే అర్హులనియు చెప్పబడినది.

అనంతరం ఆ, ఆదిశైవుల అయిదు గురు, ఋషులకు, వారి వారి కులసంజాతములగు, అయిదు వర్గములను వారితో, అనగా ఆ అయిదుగురు రుషులతోడను కలిపి ఆయా గోచర వర్గముగానే చెప్పుచు వీరందరు ఆదిశైవులే, వీనిలో గోత్రసాంకర్యమును ఎరింగి వివాహకార్యములను జరిగించు కొనవలయునని మాత్రం చెప్పబడినదే గాని, ఏక, కులమునందే గోత్ర సాంకర్య ప్రశంసలేకుండగనే ఆచార్య కన్య నర్చకుడు మొదలుగ క్రింది వారు పరిగ్రహింపకూడదను మొదలగు కొన్ని అస్తవ్యస్తపు రాద్ధాంతము లేమియు లేవు – సరిగదా కామికము నందు అర్చకునకు చెప్పబడిన గణమంతయు, ఇంచు మించుగ కారణమున కౌశికుని శివగోచర వర్గముగా చెప్పబడినది. ఇట్లే స్థానికుని వర్గము కశ్యపుని శిఖాగోచర వర్గముగ, పాచకుని వర్గము భరద్వాజుని జ్యోతిర్గోచరవర్గముగ, పరిచారక వర్గము, గౌతమ, అగస్త్యుల, సావిత్రి వ్యోమగోచర సమష్టిగా గూడ చెప్పబడినది.

ఇచట నొక విశేషము. కారణాగమము ఈ ఆచార్య లక్షణ ప్రసంగముననే, పంచానాం కౌశికాదీనాం గురు స్థాపనముచ్యతే। అని ప్రారంభించి "కౌశికస్యమహచ్ఛత్రం, కాశ్యపస్యఉపానహం" అని ఏమేమో చెప్పుచు చివరకు, "ఋషీణాంచైవ పంచానాం గురుస్థానం ప్రకీర్తితం" అని చెప్పుట వలన కౌశికాది పంచ గోచర వర్గము లకును వేయేల ఆదిశైవు లందరకును సమాన ప్రతిపత్తి యున్నట్లు స్పష్టపరుపబడినవి.

ఇంతే గాక ఇతరాగమముల యందును స్మృత్యాదుల యందును అట్టి సమాన ప్రతిపత్తి యున్నట్లు ఎన్నేని ఉదాహరణ వచనములు చూపవచ్చును.

స్థితి ఇట్లుండగా వేదములు బ్రాహ్మణములు ఆరణ్యకములు, ఉపనిషత్తులు, ఇతిహాసములు, పురాణములు స్మృతులు, సూత్రములు ఆగమములు, తంత్రములు, వీని యందు ఏ యొక్క దానికిని తత్తద్యోగ్యతలను దెల్పు నిర్వచనములు ప్రచారమున లేక, ఎరుంగమిచే కేవలము, ముఖాముఖిగ చెప్పుకొని, ప్రచారము లోనికి దెచ్చిన వేద భాగములకు తప్ప అందును ముఖ్యముగ, పద, క్రమ, ఘనాది నియమము లున్న భాగములకును, కొన్ని సుప్రసిద్ధ బ్రాహ్మణారణ్య కోపనిషద్భాగములకును, ఇతిహాస పురాణము లందలి కొన్ని పారాయణోపయుక్త భాగములకును తప్ప తక్కిన ఉపనిషత్తులు మొదలుగ అన్ని గ్రంథము లందును యెవరి సంప్రదాయమును బట్టి వారు, ఎవరి అధికారమును బట్టి వారు యెవరి స్వార్థమును పూరించుకొనుటకు వారు. వారి వారి అభిప్రాయానుసారము పలు విధములయిన శ్లోకములను గ్రంథభాగములను చివరకు గ్రంథములను గూడ కల్పించి. కర్తృనామము దెలియని ఉపనిషత్తులు మొదలుగ అన్ని గ్రంథము లందును ప్రక్షిప్తములను చేర్చుచు మార్చుచు వచ్చిన విధము పూర్వాపర ముద్రితా ముద్రిత గ్రంథములను బట్టియు। తత్తత్ చరిత్ర పర్యాలోచనల వలనను బహుముఖముల వెల్లడి యగుచున్నది. ఏదో యొక వేదమునందలివి అనుపేరున కొన్ని యుపనిషత్తులు కొన్ని ప్రాంతము లందలి గ్రంథము లందలివను పేరున నెన్నో స్మృతి వాక్యములు సూత్రములు, పురాణ ఆగమవచనములు వెలసినవి. వెలయుచున్నవి. ఇంకను వెలయగలవు కూడను అనుటకు సందేహము లేనట్లుగపడుచున్నది. జయ, విజయులు, హిరణ్యాక్ష హిరణ్యకశిపులుగ, రావణకుంభకర్ణులుగ, శిశుపాల దంతవక్త్రులుగ, ఆయా

యుగముల జన్మించిరని పురాణముల యందు విందుము. ఇట్లే నారద జన్మవృత్తాంతము. వాల్మీకి జన్మ వృత్తము, సతీదేవి దేహత్యాగము ఇత్యాదులెన్నో విందుము. ఇట్లే ప్రస్తుతము, కృష్ణుడు చైతన్యుడుగ, హరనాథుడుగ, అవతరించెనని వినుచున్నాము. అట్టిదే ఈ క్రింద యొక ఉపనిషత్, దానితో నొక స్వార్థ ఘటన మీరరయగలరు.

సదాశివునకు ఆత్రేయుడు కలిగి అతడు దూర్వాసుడై గోదావరీ తీరమునందు మంథన కాళీ క్షేత్రము నందు నూరు సంవత్సరములు తపస్సు చేయగా అతని మనస్సు నందు (ఏదో) ఇది సృజింతమని కామము పుట్టినదట. అతని ముఖము నుండి నలుగురు పుత్రులు వెలసిరట. ఆయన, మొదటి వాని నాదిశైవుడని, రెండవ వానిని మహాశైవుడని చెప్పి మూడవ వానిని, ఆర్య అని పిలిచినాడట. నాల్గవ వానిని శైవభూషణు డన్నాడట. ఆ నలువురు. తండ్రిని జేరి వంగి దోసిలి యొగ్గి, మా సృష్టి యెందుకు? మేమెవరము ? నీ వెవడవు? దేవుడు ఎవడు? జాతి ఏమి? భరణమేమి? కర్మ ఏమి? బ్రతుకడెట్లు? అనుటయు మీరు లోకముల కాదిభూతుడైన శంకరుని శివాలయునందు స్వార్థ పరార్థ పూజ, నా శాసనముగ చేయదగినది. కర్షణాది ప్రతిష్ఠాంతం ప్రతిష్ఠాద్యర్చనాంతం వేదాగమోక్త మార్గమున శివోక్తముగానే చేయించవలెను అని తనకు పూర్వమే పుట్టి యున్న కామికాది వాతులాంతమైన ఆగమములను యేకరు వెట్టి ఇవి అన్నియు ఈశాను నుండి వెలసినవి. వీనియందధికారము శివసృష్టి యందలి శివద్విజులకే కాని బ్రహ్మసృష్టి యందు శివద్విజులకును, ద్విజులకును లేదని చెప్పి, మీరు ఆదిశైవులని, శివద్విజులనీ స్థాపకులని, భట్టారకులని, గురువులని, శివాచార్యులని, దీక్షితులని, వ్యవహరింప బడుదురని వచించి, ఆయా నామములకు వ్యుత్పత్త్యర్థములను నిర్వచించెను. నేను అఘోర శివాచార్యుడను పేరుగల మీ తండ్రి దూర్వాసుడను, సృష్టి స్థితి సంహార తిరోధానానుగ్రహకర్త, సగుణ నిర్గుణరూప సదా శివుడు. ప్రవృత్తినివృత్తుల చే స్వర్గాప వర్గముల కొరకు సేవింపదగిన వాడు, యజుశ్శాఖ నధ్యయనము చేయుడు, బోధాయన సూత్రముచే కర్మాచరణము. రాజులకు శివతత్వము బోధింప దగినది. ఆగమోక్త ప్రకారము, ఆలయాదులను నిర్మించి శివలింగ స్థాపనానంతరం దాతల నుండి గ్రామ భూమ్యాధికమును దేవుని పేర గ్రహించి మీపేరున గ్రహింపక భరణము చేసుకొనుడు. అచన్కుడు (అర్చకుడు) సాక్షాత్తుగ చర రూప సనాతనుడు, శివార్చకుల కిచ్చు దానము దేవుని పేరు తోడనే, కనుక, స్వంత పేరున సంపాదింపక, వేతనోపజీవి, పాతకి కనుక, భరణార్థము వేతనము గ్రహింప కూడదు, పాతకి కారాదు, పాతకియై శివాచన్న (శివార్చన) చేయరాదు. అనుచు ఈ క్రింది హితోపదేశము చేయబడినది.

కౌశికాది అగస్త్యాంత మయిన ఋషులు సదాశివముఖోద్భవు లనియు, వారు పంచవక్త్రములచే దీక్ష పొంది రనియు మీరు వారి నాశ్రయించి ఉపనయన పూర్వకముగా శివదీక్షను పొంది ఆయా గోత్రులుగా, కండు, ఇట్లు చెప్పుట తోడనే ఆ పుత్రులు ఆ దూర్వాసుని శివరూపునిగ స్తోత్రము చేసి శలవు దీసుకనిరి. ఇంతటితో ఉపనిషత్ ముగిసినది. దీనికి దూర్వాసోపనిషత్ అని పేరు. ఇది ఏ వేదములోనిదో తెలుప బడలేదు. ఇట్లే ఈ ఒకటియే, ఇట్లు ప్రచురించుట భావ్యముగ, నుండదని

యేమో; దానితో పంచాక్షర జాబాలోపనిషత్ అని ఒకటి. దానికి శాంతి సహనావవత్, మిత్యఓగ్రేవ్యాహరేత్। నమి ఇతిపశ్చాత్ । తతశ్శివాయే త్యక్షర త్రయం। ఓమిత్యేకాక్షరంఓగంసత్య మిత్యుపనిషత్। సహనావవత్వితిశాంతిః. ఇంతటితో నీయుపనిషత్సమాప్తం- ఇట ప్రాధాన్యము దూర్వాసోపనిషత్‌కు ఇయ్యవలసిన పని యున్నది. దానినొక దానిని కల్పించుట భావ్యము కాదని దానిపూర్వాంగముగ నిది. ఆ యీ ఉపనిషత్తును ఆశ్రయించి ఒక ప్రచురణ.

## ఉత్తరాధికారికావలయును

ఆదిశైవుల గురుకులము, శిష్యకులము, అని రెండు కులములు, సుప్రసిద్ధములు. కౌశిక, కాశ్యప, భారద్వాజ, గౌతమ, అగస్త్య, ఈ పంచగోత్రములు గురుకులము. శిష్యకులము 44 గోత్రములు. ప్రతిష్ఠల యందాచార్యత్వము నకును, సన్యాసమునకును, గురుకులము నకే అధికారం కలదు. శిష్య కులమునకు అర్చనా మాత్రమే అధికారము గురుకులములో ఏ గోత్రుడు యే స్థానముందుండెనో ఆగోత్రుడే ఆ స్థానమందు ఆచార్యత్వము చేయవలెను. జగద్గురు శ్రీ కంఠ శివాచార్యులు వారు పంచగోత్రులలో కౌశికస గోత్రుడు, సన్యాసి; ఈ స్థానము నలంకరించుటకు గురుకులములో, గుణవంతుడు విద్వాంసుడునైన బాలుడు కావలయును.

యీ ప్రచురణ కొరకే ఆ ఉపనిషత్ ఉపయోగింప బడినది. దానితో ఆదిశైవులలో గురుకులము, శిష్యకులము అని రెండు కులముల కల్పనతో కౌశికాది అగస్త్యాంతముగల పంచగోత్రములు గురుకులము. ఆ గణముల యందే చేరిన 44 గుగోత్రములు శిష్యకులము అనియు, అందుకు వారి వారి కృత్యములు పై ప్రచురణయందే నిరూపింపబడినవి. దీని వలన కేవలము పై నుదహరింపబడిన పంచగోత్రముల వారికే సర్వాధికారమనియు తక్కిన వారికి అచన్న (అర్చన) మాత్రము నందే అధికారమనియు, నిర్వచించుటతోడనే ఆ కులము నందే కలవరము బయలుదేరినది. ఇందు పై సానుభూతిపరుడు, ఒక భక్తుడు, తన స్వప్నమున శివరామలింగేశ్వరుడు సాక్షాత్కరించి జరీ మదీయమహాత్మ్యమును తెలుపుచు, మత్పూజా పర తంత్రులగు ఆదిశైవులను, హీనులుగా నెంచువారి మానసమున నుండు, శంకలను ప్రోదోలుగ్రంధ మొకదాని, వ్రాయమని ఆజ్ఞాపించి, అంతర్ధానము నొందగా, ఆయన ఆదిశైవ ప్రకాశక యను గ్రంథమును వెలయించెను. అందు పై నుదహరించిన, ఆగమము లందలి ఆదిశైవోత్పత్తినే అనువదించుచు చివరకు వక మాటతో గ్రంథము ముగించుచున్నానని “ఆది శైవులు, బ్రాహ్మణులే. వారి గృహములలో జరుగు వివాహాది కార్యములను మనవారే చేయించు చున్నారు. ప్రతి కార్యం వేదోక్తము గానే జరుప బడుచున్నది. అట్టి యెడ దేవాలయముల కరిగి వారిని స్పృశింపకపోయినను, స్నానమొనరించు వెర్రి దురాచారము కొన్ని చోట్ల కనుబడుచున్నది”. అని దీనిని పెద్దలు ఆలోచించి మానెదరని వేడుచున్నాననుచు, ఓదార్పులు వెల్లడించెను. ఇందుకు ఒక సరస్వతీ స్వామియు, ఆది శైవ పత్రికా సంపాదకుడును, యోగ్యతా పత్రము లొసంగిరి, పిదప ఆదిశైవ గోత్ర ప్రవర నిర్ణయక విషయముగ

త్రిలింగాది పత్రికలందు తర్జన భర్జనలు, ఖండన మండనములు సాగినవి. ఒకరు ఆదిశైవ గోత్రములు అయిదును తదంతర్గోత్రములతో మొత్తము, నలుబది తొమ్మిది యనియు, కార్యా కార్యముల యందు, యోగ్యతాప్రతిపత్తుల యందు, అందరును సమానులే గాని, గురు శిష్య కులములను సుప్రసిద్ధి లేదను నుద్దేశ్యముతో వ్రాయగా, వేరొకరు అందుకు సమాధానము చెప్పక, ఆది శైవగోత్రములేవో, వివరముగ నిర్ణయింపకయే, అది తప్పు, ఇది తప్పు అది యుండవలయును. ఇది యుండవలయును. అని కొన్ని గ్రంధముల యందలి అంకెలు మాత్రము చూపుచు ఏమేమో వ్రాసి అది యొక ఖండనమను పేరుతో సంతోషించిరి. తరువాత దానికి మండనము చేసిన వారును అంతే వ్రాసిరి.

ఇది యంతయు చూడగా "అవిభక్తం విభక్తేషు విభక్త మివచ స్థితం" అను సూక్తి వకే కులము నందు, యెట్లు పెంటపాలై యెన్ని భేదములు కల్పించి యెంతకలవరము పెంచినదో బోధపడగలదు.

వేదమొకంటే ప్రాచీన వాఙ్మయము ఏదియు లేదని, ఇంతవరకు ప్రపంచ మంతయు అంగీకరించిన సిద్ధాంతము, తదీయ ఛత్రఛాయ అన్ని మతముల వారిని జేర్చుకున్నది. ఆ విధముగ చార్వాకము నందు నాస్తియే ఈశ్వరుడు. అర్హతులందు అర్హతుడే ఈశ్వరుడు. బౌద్ధమున, తటస్థభావమే ఈశ్వరుడు, సాంఖ్యమున, జీవుని కంటే వేరే పురుషుడు లేడు. పూర్వ మీమాంసకులకు కర్మమే ఈశ్వరుడు. పాణినీయులకు (వయ్యాకరణులకు) పరావాక్కే ఈశ్వరుడు. ఇక రామానుజీయమున, జీవ నియంత, జీవాంతర్యామి, కర్మఫల ప్రదాత, ఈశ్వరుడు జీవుని కంటే వేరుగా గలడు. నైయాయికము వైశేషికము, మాధ్వము, పాశు పతము, శైవము, ప్రత్యభిజ్ఞ రసేశ్వరం అనువాని యందు ఈశ్వరుడున్నాడు కాని అతడు కేవలము నిమిత్త కారణము మాత్రమే. కాని పాశుపతమును ప్రత్యభిజ్ఞయు ఈశ్వరునికి కర్మాపేక్షిత్వము అంగీకరింపవు. తక్కినవి, కర్మసాపేక్షుడై ఈశ్వరుడు జగన్నిర్మాణము గావించునని చెప్పును. మొత్తము పైనివి యన్నియు జీవుడు ఈశ్వరుని కంటె వేరని విశ్వసించును. కనుక ఇవి యన్నియు ద్వైతములే. విశిష్టాద్వైతమనబడు రామానుజీయమును, ఈశ్వర సారూప్య మంగీకరించి ద్వైతమే అగుచున్నది. యోగమును, ఈశ్వరుడు జీవునికి వేరుగ నున్నవాడనుచు అతనిని నిమిత్తము ఉపాదానముగా కూడ నంగీకరింపలేదు. కాగా, నదియు ద్వైతమే యగుచున్నది. ఇక ఈ మతముల నన్నింటిని లోగొని వాని వాని స్థితులందు వాని వాని గొప్పదనముల నంగీకరించుచు అన్నింటికి అద్వైతము ఆచ్ఛాదన ఇచ్చుచున్నది. కనుక వీని అన్నిటి దృష్టిని బట్టి అది యొక మతముగ వీని ఖండన మండనములకు పాలైనదని అనుకొనవచ్చును. కాని అది నిజముగా నొక మతము కాదు. ఆ యీ విషయము పుష్పదంతుని ఈ వచనము సంగ్రహముగా చక్కగా తేటపరచుచున్నది.

"త్రయాసాంఖ్యం యోగః పశుపతి మతం వైష్ణవ మితి ప్రభిన్నే ప్రస్థానే పరమిద మదః పథ్యమితిచ, రుచీనాం వైచిత్ర్యాదృజు కుటిల నానాపథజుషాంనృణామేకో గమ్యస్త్వమసి పయసామర్ణవఇవ" ఇట్టిదే మరియొక సూక్తి "యంశైవా స్సముపాసతే శివఇతి బ్రహ్మేతి వేదాంతినః। బౌద్ధాబుద్ధ ఇతి ప్రమాణ పటవః కర్తేతి నయ్యాయికాః। అర్హం నిత్యధ జైనశాశ నరతాః కర్మేతి మీమాంసకాః। సోయంవో విదధాతు

వాంఛితఫలం త్రైలోక్య నాథో హరిః॥ ఇక ప్రస్తుతము శైవ దశన్నముల (దర్శనముల) ఆరంభ విశేషములను చూతము.

(1) నకురీశపాశుపత దశన్నము – దాసత్వాది పదములచే పరతంత్రత్వాది దుఃఖమునకు అంతము లేదని పరమైశ్వర్యమును కోరి దుఖబీజరహితమైన ముక్తాత్మ కావలయుననియే దీనియారంభము–

(2) శైవదశన్నము – కర్మాది నిరేపేక్షకుడగు ఈశ్వర్డు కారణమని అంగీకరించుట వలన, నకురీశమతము వైషమ్యనైర్ఘృణ్య దూషిత మగుటచే, పతి, పశు, పాశ తత్వత్రయ వ్యవస్థాపనతో కర్మాది సాపేక్షుడు అగు ఈశ్వరుని కారణముగ, నంగీకరింపుచు వెలసినది.

(3) ప్రత్యభిజ్ఞాదశన్నము – నిరేపేక్షమగు జడమునకు కారణత్వము అసంభవము అను మొదలగు వాదమునందు అసంతృప్తి ప్రకటింపుచు ఈశ్వరుని ఇచ్ఛావశమున జగత్సృష్టి యగుచున్నదని యారంభింప బడుచున్నది.

(4) రసేశ్వర దశన్నము – పరమేశ్వర తాదాత్మ్యమున్నను శరీర స్థితి ఉన్నప్పుడే సర్వాభిమతమగు జీవన్ముక్తి కలుగునన్నది ప్రధానముగ ఆరంభింప బడినది. ఇవెల్లనిట్లుండ, యెవరి మతమును బట్టి వారు సృష్టి కర్తను వేరు వేరు యోగ్యతలతో అంగీకరించి అతని నుండియే సర్వసృష్టియు కలిగినది అని చెప్పుకొనుట సమంజసమే యగును. ఆ సృష్టినుండి మానవత్వము యేర్పడిన పిమ్మట బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రములు "చతుష్టయం వా ఇదగ్ం సర్వం" అను న్యాయప్రకారము వ్యక్తి పరముగ, సాంఘికముగ, గుర్తించి, ప్రధానమగు మానవత్వమును మరువక, దైవత్వమును అందుకొనుటకు చూచుట ముఖ్య కర్తవ్యము. అట్లుగాక, మొదట తన మానవత్వమును మరచి తనలోనున్న "ప్రకృతి విశిష్టం చాతుర్వణ్యన్ సంస్కార విశేషాచ్చ" అను సూత్ర ప్రకారము వ్యక్తి చాతుర్వణ్యన్ సమశన్ నెరుంగక, సాంఘిక చాతుర్వర్ణ్యవ్యవస్థా విషయమున అంధకారమున బడి స్వార్ధలీలకు ఉపక్రమించుట గహిన్ంపదగినది. అట్టి స్వార్థ లీలలు పైనుదహరించిన, ఆగమాదులందు ఎట్లెట్లు ప్రక్షిప్తములై యున్నవో అవి యాధారముగ గొని నోరు గలవారిది రాజ్యమన్నట్లు కల్పించిన ఆచారభేదములు యెంత అసమంజసములుగ నున్నవో బోధపడగలవు. ఉదాహరణమునకు, స్థాలీపులాకన్యాయముగ పట్టి చూతము.

బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులను నాలుగు వర్ణములు స్థిరచరము లందు వైయక్తికముగ, సాంఘికముగా సృష్టికర్త నుండి వెలశి యుండుననుట నిర్వివాదాంశము. ఆ సృష్టి కర్త, శివుడో, విష్ణువో, బ్రహ్మయో కావచ్చును. ఏ పేరున పిలిచినను బాధ లేదనుకొన్నపుడు వివాదమే యుండదు. సృష్టికర్త ఎవరైనను అతనికి రెండు మూడు కాక, వకటి, నాలుగు, అయిదు ముఖములనుట వక విధమయిన విజ్ఞానమునకు చెందినదే యగును. రెండు మూడన్నవి కూడ బొత్తిగ త్రోసివేయదగినవి కావు. అవియు చాల గంభీరమయిన అర్థము గలవే. మూర్తియన్నను ముఖమన్నను ఒకే అర్థమని తోచుచున్నది. చివరకీ ముఖ సంజ్ఞ తొమ్మిది వరకు పోవచ్చును. పది నుండి ఏ సృష్టియు కలుగదు. అంతకు పైన సంఖ్యయు

లేదు. యెనిమిది వరకు ప్రకృతి సంబంధమే. దానింబట్టి సృష్టికర్త అష్టమూర్తి కావచ్చును. "ఏకామూర్తి స్త్రిధాభిన్నా బ్రహ్మ విష్ణు మహేశ్వరాః" అను చొప్పున త్రిమూర్తి కావచ్చును. "భూమిరాధనలోర్వాయుః" అను శ్లోకానుసారము అష్టమూర్తి కావచ్చును. న్యూనాద్వైప్రజాః ప్రజాయంతే" అను ప్రకారం నవమూర్తి కావచ్చును. త్రివృత్తుకరణము వలనను అనగా 3 × 3 వలనను తొమ్మిది కావచ్చును కదా. ప్రాణ సంఖ్యను బట్టి "సప్త ప్రాణాః ప్రభవంతి తస్మాత్" ఇత్యిది శ్రుతుల వలన సప్త మూర్తి యనుటకు సందేహింప బనిలేదు. "షట్కౌశికమిదంసర్వం" అను చొప్పున, షణ్మూర్తి, షణ్ముఖుడు, అనవచ్చును. "యస్మిన్ పంచ పంచజనాః" అను శ్రుతి చొప్పున పంచముఖుడు అన్నను అనవచ్చును. వైజ్ఞానికముగ, ప్రాణః ఆపః, వాక్కు, అన్నం, అన్నాదః అన్నవి పంచముఖములే, "చతుష్టయంవా ఇదం సర్వం" అను చొప్పున అన్నము. అన్నాదునిలో లీనముకాగా, లేదా, మరొక భంగిమములో అన్నాద రుద్రుడు అన్నముఖమును ఖండింపగా, సృష్టికి చతుర్ముఖుడే కర్త యగును. "ప్రకృతింపురుషంచైవ" అను చొప్పున సృష్టి కర్త ద్విముఖుడు అన్ననూ బాధలేదు. ఇంతకు వేదము యొక్క తాత్పర్యం "ఏకంవా ఇదం విభూవ సర్వం" "ఏకం స ద్విప్రా బహుధా భవంతి" సబ్రహ్మసశివస్సహరిస్సేంద్రస్సోక్షరః పరమస్స్వరాట్" "అసదేవేదమగ్ర ఆసీత్" "సదే వేద మగ్ర ఆసీత్" అనియే తాత్పర్యము. ఏకము బహుత్వము నొందుట సంచరపక్షము. నానాత్వమేకత్వమునొందుట ప్రతి సంచరపక్షము, సంచర ప్రతి సంచరములు, వేద, స్మృతి, పురాణాదు లన్నింటికినీ సమ్మతులే, "ఇతిహాస పురాణాభ్యాం వేదం సముపబృంహయేత్" అనియే సిద్ధాంతము. బృంహణము నొందునది బ్రహ్మ. అది విష్ణువో, శివుడో కావచ్చును. అతని మూర్తులో, ముఖములో, కోశములో పైన వ్రాశిన వన్నియు కావచ్చును. ఏమైనను సర్వం ఖల్విదం బ్రహ్మ అన్నది ఉండనే ఉన్నది గదా! దానిని పౌరాణికముగనో, ఆగమికముగనో, సర్వం విష్ణు మయం జగత్, సర్వం శివమయం జగత్ అని మతస్తులు సంతోషింపవచ్చును. "సర్వం ఖల్విదం బ్రహ్మలోని బ్రహ్మ । బ్రహ్మ విష్ణు మహేశ్వరులలోని బ్రహ్మ కాడు. పురాణాగమికులు వాడుకొను, శివ, విష్ణు శబ్దములును. ఆ త్రిమూర్తు లందలివి కావు. ఆ త్రిమూర్తులకు ఆవలినుండియే సృష్టి, ఆ అతీతతత్వమే, వేదాంతముల యందలి బ్రహ్మ, శైవుల శివుడు. వైష్ణవుల విష్ణువు. అని గుర్తుంచుకొన్నప్పుడే పురాణాగమార్థము లందలి సత్యము గోచరించి ప్రక్షిప్తములు గోచరించుట తటస్థపడును.

దీనిని బట్టి బ్రహ్మ సృష్టి వేరుగ, శివ సృష్టి వేరుగ, విష్ణు సృష్టి వేరుగ నుండుననియు ఆయా సృష్టులు ఆయా ఇతరులకు అపవిత్రములగు చుండుననియు అనుకొనుట వెర్రి తనము. ఈ వెర్రి తనపు మాటలలో చేరినవే ఈ క్రింది పంక్తులు.

"శివస్య పంచ మూర్ధ్నిభ్యః యేశైవబ్రాహ్మణాస్మ ృతాః। జాతాస్తేహ్యాదిశైవాఖ్యాః కేవలం బ్రహ్మణోముఖాత్। జాతాశ్చాన్యాశ్చఋషయః సామాన్యబ్రాహ్మణోభవేత్, ఏతేషాం బ్రాహ్మణానాం చ శివద్విజ విశేషకం। ఆదిశైవమితిఖ్యాతం సర్వేషాంగురురిత్యపి –

ఇట్టి పిచ్చి వ్రాతల నమ్ముకొనుట వలన "వర్ణానాం బ్రాహ్మణోగురుః" అను సార్వజనిక సిద్ధాంతము ఎగిరిపోవుటయు. త్వం శుంతత్వంశుంత అను కలహములు అంకురించి తదావేశమున, నిమిత్తమును బట్టి వచ్చిన విశేషమును ఆవేశముతో పట్టుకొని స్వకీయమగు జాతి వర్ణములనే, మరచి పోవుట శోచనీయుము. కనుకనే ఈ అయోమయ ప్రాప్తి యోగములో "ఆదిశైవులు బ్రాహ్మణులే వారిని స్పృశింపక పోయినను దేవాలయములకరిగి స్నానమొనరించు వెర్రి దురాచారము" ఇత్యాది వ్రాతలు బయలు దేరుటయు, వీనిని, ఆ కులము వారి, స్వామియు । తత్పత్రికాధిపతులును, అభినందించుట, జరిగినది. స్పృశించినయెడల స్నానము చేయవలయునన్నది వీరందరును సమ్మతించి స్పష్టపరచుకున్నట్లు ఈ వ్రాతవలన తేలుట లేదా:-

ఈ వెర్రి తనమును బట్టియే మరియొక విశేషము నాశ్రయించి, వారి వారి ఉత్పత్తి విశేషములను వేరు వేరుగా చెప్పుకొనుటయు, తమ్ము తాము మరచి తమలో వారిని కూడ, గురుకులము శిష్య కులము అనుకొనుటయు, వ్యక్తి ప్రతిష్ఠను పరనిందా పూర్వకముగా ప్రకటించుకొనుటయు, అందుకు కొన్ని యుపనిషత్తుల వరకు విశ్వామిత్ర సృష్టి గావించుటయు జరిగినదని, ఇంచుక ఆలోచించిన వారికి తోచకపోదు. "అన్యోన్యంగురవోవిప్రాః" అను సార్వజనిక ధర్మారంభము అడుగంటి "సర్వేషాంగురురిత్యపి" అను వివాదపు తుంగ తలయెత్తినది. ఇట్టి ఆగమ వచనములు ప్రక్షిప్తములగు చిత్త విభ్రమాగమ వచనము లనుటకు సందేహము లేదు.

ఋషులను చెప్పి స్థానములతో వారి వ్యుత్పత్తులను దీక్షలను చెప్పి, వారి కులమంతయు యొక గోచర వర్గముగ నిర్ణయించి వివాహ కార్యములందు సాంకర్యము రాకుండ చూచుకొనుటకు అనవుగ సమానాధికారములతో సమాన గౌరవ ప్రతిపత్తులతో నొక యాగమము చెప్పగా, వేరొక యాగమము చెప్పగ, వేరొక యాగమము అందుకు విరుద్ధముగ వచించునప్పుడు ఏది నిక్క (నిజము) మనవలయును? దేనిని అబద్ధమనవలయును? సంకుచితమగు ధర్మమునా? వ్యాపకమగు ధర్మమునా? లక్షలు మొదలు శంఖములను సంఖ్యలను కూడా దాటిపోయిన ఆగమవచనము లందుఉన్న కర్మ చాలక, ఉపాకర్మకు వెలశిన లక్షల కొలది సంఖ్యలు గల ఉపాగమములందు ప్రక్షిప్తములు లేవని అనగలమా? ఇందలి పరస్పర విరుద్ధ వచనములకు గతి కల్పన, బుకాఇంపులతో తీరదు కదా -

వేదములు బ్రహ్మ విష్ణు మహేశ్వరుల కతీతమయిన బ్రహ్మ ముఖము నుండి నిశ్వసిత రూపములు గనో మరొక రూపము గనో పుట్టినవని, వేద మనగా ! ఈ ఆగమములో అన్నియు ఉపాగమములతో సహా శివుని ముఖము నుండియో కంఠము నుండియో కొందరి శ్రోతల యెదుట ఆవిర్భవించినవి. ఇట్లే వైష్ణవాదుల యాగమములు తంత్రములు, యామళములు, డామరములు మొదలగునవి అన్నియు వారి వారి ఇష్ట దైవమును బట్టి వెలసినవి. ఇట్టిచో దీని యందలి ప్రక్షిప్తములను ప్రక్షిప్తములని యనుట కూడ పాపమన్నంత కట్టు దిట్టముగ వెలసినవి. ఏమి చెప్పగలము? ఇట్టి తంత్రములను బట్టి భేదములు అన్ని రంగములందు యెన్నేని అంకురింపగలవు గదా!

ఇట్టి భేదమును పురస్కరించుకునియే "శివసృష్ట్యన్వితాయేతే" అను మొదలైన శ్లోకములతో త్రిలింగ యందు ఋషులు తదీయగోత్రములను గురించి ఋషులలో బ్రహ్మ సృష్టిలోని వారు, శివ సృష్టిలోనివారు. అను మొదలగు ద్వైవిధ్య చర్చ జరిగినది. ఆగమముల యుద్దేశ్యము. ఏ మాత్రము తెలిసియున్నను ఆ చర్చ అర్థవంతముగ నుండెడిది. అందు ఆగమ గంధము కూడ ఉన్నట్లు గోచరించదు. శివసృష్టి యనియు బ్రహ్మ సృష్టియు. విష్ణు సృష్టి యనియు, క్రైస్తవ సృష్టి. మహమ్మదీయ సృష్టి అని, ఎవరి బాజా వారు వాయించుకొనుట అగును గాని, వారినైనను వారుద్ధరించుకొనుట కాదు. ఇట్టి వాదములను లేవదీసి భేదములను కల్పించుటను చూడ. వక వంక నవ్వును, వక వంక జాలియు కలుగుచున్నది. మేము ఆదివారము, మాది, అనాది కులము, తక్కిన వారిది కాదు అని చెప్పుకొనువారు. ఈ చెవులనున్న పోగులు నావే యని అడుగకుండ చెప్పిన పెళ్లి కొడుకు తెలివి తేటల కోటిలోని వారనిపించుకొందురు. ఈవిధముగనే అనేక నిష్కారణ భేదములు పొడచూపుట వలననే ఒక విధముగ "బ్రాహ్మణామనేకత్వం" సార్థకమైనది. అది అంతటితో ఆగక, తాము తమ బ్రాహ్మణ్యమును కూడ మరచి, తమశ్రేష్ఠతను ఒప్పుకొనుటలో ఒక వంక మేము బ్రాహ్మణులము కాము. వేరొక వంక మేమే మొదటి బ్రాహ్మలము అని పలికించుచున్నది. ఈలాటి భేద కోటియందే పెక్కు కులములు (సంఘములు) (కోలతి సంఘీభవతికులం) బ్రాహ్మణులను తమలో తాము హెచ్చు తగ్గులుగ దూషణ భూషణ తిరస్కారములు కావించు కొనుటకును నూతన బ్రాహ్మణ సృష్టియగుటకును కారణములైనవి. బ్రాహ్మణులందు శాఖాభేదములు, వేదశాఖాధ్యయనములను బట్టియు, ఆయా దేశ పరిపర్తనను బట్టియు మొదట నేర్పడినవి. దానిని బట్టి ఋగ్యజుస్సామాథర్వశాఖలు, బోధాయన, ఆపస్తంబ, ఆశ్వలాయనాది సూత్రములు, వెల్నాడు, వేగినాడు, మురికినాడు, కాసలనాడు, తెలంగాణా భేదములు వెలశినవి. ఇందంతటను వైదిక, నియోగ భేదములు ఇవి వృత్తి పరివర్తనము వలన గలవి. ఇందు శైవ, వైష్ణవ, శాక్తేయ ఇటీవలి ఆర్యబ్రహ్మ దివ్యజ్ఞాన సమాజక ఇత్యాదులు మతములను బట్టి కలిగినవి. ఇందు ఒక విధముగ పైన చెప్పిన శాఖా, నాడీ, భేదములువారు సామాన్యముగ బ్రహ్మణు లనియే వ్యవహరించు కొందురు. తక్కిన వారలు, మేమెక్కువ, వారులోచ్చు, అనుమాటలతో బ్రాహ్మణ ఇల్లు ఏది? అని అడిగిన, సామాన్య నిర్వచన ప్రకారమున్న వారి ఇంటినే చూపుదురు. దీని యర్థమేమి తిరమలేశ?

ఇది ఇట్లుండగ విశ్వబ్రాహ్మణులను తగవు చిరకాలము నుండి సాగివచ్చుచున్నదే, ఆంధ్రమున వీరు విశ్వబ్రాహ్మణులమందురు. ఇందును కొన్ని చోట్ల కొందరు కరణములమందురు. ఉత్తర దేశము నందు వీరు క్షత్రియు లనిపించుకొను వాదమునందు గ్రంథములే వెలసినవి. ఇట్లే తేలీబ్రాహ్మణులు, నాయీ బ్రాహ్మణులు ఇట్లు ఎన్నో భేదములు, వీరందరకు ఋషులున్నారు. గోత్రములున్నవి. ప్రవర లున్నవి. ఎవరి మత ప్రకారమైన సృష్టి కర్త వారి వారిని సృష్టించి యుండవచ్చును. ఆయా సృష్టి కర్త సృష్టించిన ఋషులే వారి వారి ఋషులై యుండవచ్చును. ఈవిధముగ దైవ భేదము నుడి ఋషి భేదము మొదలుగ తాను, తన కుటుంబము, తన అందర్బాహ్యావయవముల వరకు భేదము కలుగవచ్చును. ఆ

ఈ భేదములు తన్నుగాని, తన వారిని గాని, లేదా మానవులను గాని యుద్ధరించుటకు పనికిరావని యెంత త్వరగా తెలుసుకొనిన అంత మంచిది. అందరును బ్రాహ్మణులను దిట్టువారు, తాము బ్రాహ్మణులు కాగోరువారు, ఎవరి కోరు బ్రహ్మణ్యము వారికే గొప్పది. ఆదిది, అనాదిది కూడను అహో! భ్రాంతి విలసనములు.

"నవిశేషోస్తి వర్ణానాం సర్వం బ్రాహ్మ్య మిదంజగత్‌ బ్రహ్మణాపూర్వ సృష్టం హి కర్మభిర్వర్ణతాంగతం" అను వ్యాస వచనమునకు అర్థము పైవిధముగ తేలినది. బ్రహ్మసృష్టము అంతయు బ్రాహ్మమే. కర్మ వలన వర్ణత్వము వచ్చినది. బ్రహ్మ సృష్టికి "సర్వంఖల్విదంబ్రహ్మ" శివ సృష్టికి "సర్వంశివమయంజగత్" విష్ణు సృష్టికి "సర్వం విష్ణుమయంజగత్" స్వర్ణ సృష్టి అంతయు స్వర్ణమే. కర్మభేదమును బట్టి వేరు వేరు పేరు లొందినను. వస్తువు యొక్క విలువ యందు, నాణెమునందు, మార్పుండదని యెరింగినచో యెన్ని మతములున్నను, యెన్ని ఆచారములున్నను మానవకోటి సుఖింపవచ్చును. అది లేని నాడు అంతయు కష్ట భూయిష్ఠమే. శైవ ప్రతిష్ఠిత శివునకు వైష్ణవ ప్రతిష్ఠిత విష్ణువునకు పటుత్వముండుననుట చెప్ప నక్కరలేదు. అట్టి అచన్‌కులు (అర్చకులు) అపవిత్రులను కొన్నచో ఎవర్నేమనవలయును? ఇందు ముఖ్యముగ ప్రస్తుత కాలమున అర్చకుడు, పురోహితుడు, ప్రజలకు ఒక దాసుడుగ, సేవకుడుగ, ఇంకను అంతకంటే తక్కువగ ఉన్నాడన్నది సర్వత్ర వ్యాప్తమయి యున్న మతముగ తోచుచున్నది. ఆస్తిని ప్రజలంగీకరించుటయు, అచన్‌క (అర్చక) పురోహితులంగీకరించుటయు, ఇరువురకును సిగ్గు చేటు – తమకొక నౌకరుగ నున్న అచన్‌కుని (అర్చకుని) కృత్యము, పురోహితుని కృత్యము ప్రజలకెట్లు పవిత్రము? ఆ అర్చక పురోహితలకెట్లు పవిత్రము? అర్చకుడు అనాదివాడనని, గ్రంథోదాహరణముల వలన నిరూపింపబోయిన నేమి లాభము? పురోహితుడు అనాది వాడనని వాజ్మూలము లిచ్చుకొన్న నేమి లాభము? అట్టి వారి కృత్యముల వలన ప్రజలకు సిద్ధించు దైవీ సంపత్తులేమి? ఆ ఈ విషయములను హృదయముపై చేయివైచి వివేకించుకొన్నప్పుడు విజ్ఞానము గల వారికి నిష్కర్ష తోపకపోదు. ఇక –

ఈ గోత్రము వాడు పూజ్యుడు, ఆ గోత్రము వాడు అపూజ్యుడు. వీని కింత యధికారము, వానికి అంతే అధికారము, అనుకొనుట కూడ, మరింత కటికి చీకటిలోని, స్వంత బాజావాయింపు అనుటకు సందేహము లేదు. ఒక కులములోనే సన్యాసులగు వారికి కూడ ఇట్టి పాక్షికాభిమానము చూపుట యన్నది మరింత గహన్‌ణీయము, గురుగోత్రములు వేరుట, శివ గోత్రములు వేరుట, గురుకులములు వేరట, శిష్య కులములు వేరట, ఏవో గోత్రమేలే గురుకులములట. అందు పుట్టిన వారికే సర్వాధికారములట, సన్యాసాధికారము కూడా వారికేనట, తక్కిన వారు తక్కిన వారేనట – అహో! స్వాముల కుండవలశిన వైరాగ్యము? నిష్పాక్షికత, ఓడి పోవచున్నది. కారిపోవుచున్నది. "బ్రాహ్మణా వివిదిశంతి యజ్ఞేనదానేన తపసాఅనశనేన" బ్రాహ్మణస్యేవాధికారోవ్యర్థామే" ఇత్యాది శ్రుతి వాక్యములు గాలికి పోయినవి. క్షత్రియ వైశ్యులకు గూడ సన్యాసమందధికారమంగీకరించిన స్మృతికార వచనములు తుంగలో ద్రొక్కబడినవి. కౌశిక గోత్రుడు కావలయునట, ఆది శైవుడై కౌండిన్యస గోత్రుడన్న అఘోర శివాచార్యులగతి ఏమి

కావలశినది? ఆయన స్వయముగ గొప్ప గ్రంథకర్త గొప్ప వ్యాఖ్యాత, అతని భాషామాధుర్యము వర్ణనాతీతము. అట్టి వాడు ఈ ప్రచురణకర్తలకు గవ్వకు కొరగాని వాడు అనియే గదా భావము. సర్వులకు సర్వాధికారములు సమానముగ నున్నప్పుడు ఈ ప్రత్యేకత వీరికి ఎటనుండి లభించినదో? లక్షలాది సంఖ్యలుగల ఆగమ ప్రక్షిప్తముల నుండియా? లేక వీరి కొరకు ప్రత్యేక శ్రుతులు ఇంకేమైనా వెలసినవా? లేదా దూర్వాసోపనిషత్ వలెనే వీరేమైన వెలయించి యుండిరో? ఉపనిషత్ వెలయుటకు ప్రధాన విషయము అంత మాత్రమునకేనా? ఉపనిషదవసరం ఎంత చౌక అయినది? దూర్వాసుడఘోర శివాచార్యుడనుట కంటే, నే నఘోర శివాచార్యుడని చెప్పుకొనుట బాగుండును. అవును. ఈయన శ్రీకంఠుని అపరావతారముగదా। అట్టిచో అఘోర శివాచార్యుడను కొనుట, అప్రతిష్ఠయే ఏలయన, శ్రీకంఠుడు కౌశిక గోత్రుడట । స్వామి వారిది. అఘమషణ్పూర్వకౌశిక అయిననూ అదే గోత్రమనుట, కనుక వారట్లు చెప్పరు, వారెప్పుడును గురుకులము వారే, ఎంత వారైనను ఈ గురుకులము వారు శిష్యకులము వారిని వారెంత వారైనను అంగీకరింపని వారే. ఈ గురువుల నాశ్రయించిన శిష్యులిట్లే యుందురు. గురువులు గురువులే, శిష్యులు శిష్యులే. దేనికిని ఎదుగు పొదుగులు లేవు. ఋషులందరును, వారిని బట్టిన ప్రవరలన్నియు. అది కలిగిన బ్రాహ్మణ్య మంతయు, సర్వకృత్యములయందు సర్వాధికారముతో వెలయుటన్నది వీరికి గిట్టలేదు. అందుకొక ఆగమసృష్టి. తానును తాను చెప్పిన శిష్యకులము నందుచేరిన గోత్రము వాడయ్యె. కౌశిక గోత్రుడని (అఘమర్షణ పూర్వ కౌశిక అయ్యును) ఒక బుకాఇంపు. ఒక తడిక అడ్డము. ఇట్టివి స్వాముల కుండవలశిన చేష్టలేనా? ఇట్లే అన్నిటిను అన్ని వర్ణములందును, కులములందును, భేదభావములు సన్యాసులు వరకును వ్యాపించినవి.

ఇంతకును రెండు ప్రతిస్పర్ధి మతములు అని పేరు మాత్రమునకు శైవ వైష్ణవములు రెండును దాక్షిణాత్యములుగనే వృద్ధి పొందినవి. రెంటికిని తమిళ సంస్కృతి అంటుకొని యున్నది. ఒకరిని చూచి యొకరు, పేరు లందు, వేషములందు, భేదమే కాని, మతములందు పోలికలోకటే కాగా ఆచరణ మార్గములందును ఒకరిని చూచి యొకరు అనేకములగు ప్రక్షిప్త శ్లోకరచనలతో యెవరి స్వార్థమును వారు సంపాదించుకొన్న విధము వారి వారి వాఙ్మయములను కనుగొన్నప్పుడు విశదము కాగలదు. ఈ కోటి లోనివే అర్చక పాచక స్థానిక పరిచారకాధిబేధములు. ఇంతకును శైవ మన్నది ఇంచు మించుగ లింగాయతు లన్న వారి యందే రూఢమయినదా? (అదియు అన్ని జాతుల యందును వ్యాపించి యున్నది) శివార్చకులు మాత్రమే శైవులా? బ్రాహ్మణులందైనను, లింగాయతన శాఖకు జెందని శైవులు లేరా? ఏమైనను అన్వయవ్యతిరేకముల వలన దీని స్థితి శివాచన్కులతోనే (శివార్చకులతోనే) ఆగిపోదని తోచుచున్నది. ఇతర వర్ణముల మాట ఇట చెప్పబనిలేదు. ఇట్టిచో పైన వ్రాసిన ఆ ఈ భేదములతో బ్రయోజనమేమి? బ్రాహ్మణ్యమున, ఏ వృత్తి, నవలంబించినపుడు ఆయా వృత్తి విశేషమును బట్టి వారి వారి కర్మాచరణ విధానము నందు భేదము వచ్చినంత మాత్రమున బ్రాహ్మణ్యమన్న దానికి లోపము రాదు. వారి గోత్రములను బట్టియు ప్రవరలను బట్టియు వారి వారి అధికారములందు హెచ్చు తగ్గులు

కలుగవు. అన్నియు వేదముల నుండియు వేదముల ననుసరించిన స్మృతి పురాణాగమాదులనుండియు వెలసినవే గాని వీనికి వేరు వేరు విభాగము అంతగా వస్తుతః గణనీయము కాదు.

ఋషులను గూర్చియు, గోత్ర ప్రవరలను గూర్చియు సవిమాశన్ముగ (సవిమర్శనముగ) మొదట నిరూపింపబడినది. ప్రస్తుతము అంతకంటే విస్తరింప పనియును లేదు. ఆ ఋషులకు ద్వైవిధ్య మన్నది కల్పించుట యెవ్వరి కేనియు మత దురాభిమాన చేష్ట యనిపించుకొనును. ఇట్టి చేష్టలు, లోకము మూయ మూకుడు వెదకుటవంటివో, పాలు ద్రావు పిల్లి కన్నులు మూసుకొనుట వంటిదియో అగును. కానిందు ఇంతకు వెలనాటి పూజారు లనువారు లెవరు? వారాదిశైవులా? అనాదివైష్ణవులా? ఇందెవరు బ్రాహ్మణులు? ఎవరు అబ్రాహ్మణులు?

ఏమియులేని అద్వైతులకు కూడ ఈ భేదపు చీడ కొలదిగనో గొప్పదిగనో అంటుకొనక పోలేదు. కేవలము లింగాయత బ్రాహ్మణులకును వీరికిని కొంచెము కంచము పొత్తైన కలసినది కాని వైఘానసులతో అందుకును నోచుకొనలేదు. ఏదైనను వైదికమంత్రము కంటే వైష్ణవ మంత్రమునకే ఎక్కువ పటుత్వము చేకూరినది. ఏవిధముగ చూచినను ఉత్పత్తి వ్యాప్తులకు దక్షిణ దేశమే ప్రధానముగ నుండుటచే అచ్చటి శైవవైష్ణవులు, ఆ దేష్టలము మేమే అన్నంతగా తమ ఆ దేష్టృత్వమును ఈ ఆంధ్ర దేశమున చక్కగ సాగించుకొనుచు ఇచటి వారిని శిష్యకులముగ శాశ్వత పరచు చున్నట్లు తోచును. ఆంధ్రకు సహజ మగు తొందరపాటులో దాక్షిణాత్యుల తప్పులే మన కంటుకొని శాశ్వతముగ పీడించుచున్నవి గాని వారి ఒప్పులేమియు మన కంటుకున్నట్లగపడదు. అచట ఒప్పులుగ మారిన తప్పులైనను మనము సంవరించు కొనలేక అల్లాడుచున్నాము.

———— o ————

బ్రహ్మశ్రీ చల్లా కృష్ణమూర్తి శాస్త్రి గారిచే రచించబడిన పం. మధుసూదన ఓఝా వారి వేద విజ్ఞాన సంబంధిత "ఋషి విజ్ఞానము" విషయము లభ్యమయినంత వరకూ ప్రచురించడమయినది. ఇంకనూ కలదు. అసంపూర్ణముగానే ఉన్నదని మనవి.